

ఆంధ్రప్రదేశ్
అంతటా
డిసెంబర్
14
విడుదల



ఏ.వి.యమ్. ప్రొడక్షన్స్ వారి

# అవే కళ్ళు

ఈస్ట్మన్ కలర్



EXPOSED ON **EASTMANCOLOR**
PRINTED ON **ORWOCOLOR**

కథ, దర్శకత్వం.
**A.C.త్రిలోకచందర్ M.A.**

**AVM PRODUCTIONS**

నవయుగ.



## పాఠకులకి మనవి

**పాఠకులకి మా క్రిస్మస్ శుభాకాంక్షలు.**

ఈ సంచికలో ప్రచురించిన పెద్దకథ 'తామ్రశాసనం' చివర 'ఇంకా ఉంది' అని కొన్ని కాపీలలో పొరపాటుగా ప్రచురించబడినది. 'తామ్రశాసనం' ఈ సంచికతో అయిపోయిందని పాఠకులు గమనించ కోరుతున్నాము.

8-12-67 సంచికలో ప్రచురించిన 'ఉద్యోగినిగా అవివాహిత స్త్రీ సమస్యలు' వ్యాసంలో 18వ పేజీ 2వ కాలంలోని మొదటి పేరాలో 'వైరాశ్యంగా కాలం గడుపుతుంది' అన్నదానికి బదులు 'వైరాగ్యంగా కాలం గడుపుతుంది' అని, అదే పేజీలోని 3వ కాలంలోని మొదటి పేరాలో 'నాలుగు పార్కు జరగాలి' అన్నదానికి బదులుగా 'నాలుగు పార్కులు చూసుకోవడం, సరదాగా దుకోవడం కల్పితంగా జరగాలి' అని ఉండాలి. పాఠకులు దీనిని గమనించ కోరుతున్నాము. పొరపాటుకి చింతిస్తున్నాము.

—సం॥

# ఉత్తరాలు

### ముఖచిత్రం

1—12—1967 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం చాల బాగుంది. అని చెప్పుట అతిశయోక్తి కాదు. కార్టూను వ్యాఖ్యలు— కడుపుబ్బ నవ్విస్తున్నాయి.

శ్రీపతిగారు వ్రాసిన "కుంకుమ", కొంపల్లి గౌరీశంకర్ వ్రాసిన 'మొగలిపువ్వు' కథలు చాలా బాగున్నాయి. మంచి మంచి కథల నందిస్తున్న రచయితలకు, ప్రచురిస్తున్న మీకు నా ధన్యవాదాలు.

టి. రజవల్లభాయి (ఆర్మూరు)

### కథలు

"ఎమ్. ఏ.లు, డాక్టర్లు చదివిన మనిషిలోని స్వార్థం మాత్రం నశించలేదని, స్వార్థానికి ఒక్కొక్కప్పుడు భయంకరమైన, భరించరాని బలిని గైకొనే శక్తి ఉందని మీరు 8—12—67 సంచికలో వేసిన సుభద్రగారి "స్వార్థపరుడు" కథ వలన మనం ఓ మంచి అనుభవాన్ని సంపాదించవచ్చు.

వి. వి. స్వామి (కరీంనగరం)

* * *

"8—12—67 ఆంధ్రపత్రికలో ప్రచురితమయిన, 'అరుణ గారు వ్రాసిన 'ఆత్మసాక్షి' చదివాను. ఈ కథలోని సంఘటనలు కళ్లకు కట్టినట్లు ఉన్నవి. కథ చదువుతూంటే కొత్తపంథాలో నడుస్తున్నట్లనిపించింది. కాని, కథను పూర్తిగా చదివిన తరువాత కొన్ని పాతకథలు వెంటనే జ్ఞాపకమొచ్చాయి. కథలో అసహజత్వం అస్పష్టంగా అగుపడింది. అయినా, సంఘటనల వర్ణనా, ప్రాధాన్యతా బాగున్నవి. 'సుభద్ర'గారు వ్రాసిన 'స్వార్థపరుడు' కథ ఎంతో సహజంగా ఉందని నా అభిప్రాయం. ఆఖరుగా 'మాధవ్'కు 'మురళి' వ్రాసిన ఉత్తరం

దువుతుంటే, నా నేత్రద్వయం నుండి కన్నీళ్లు రాలాయి. ....''

ఎస్. వి. ఎస్. ఎన్. మూర్తి (బరంపురం)

*   *   *

'స్వార్థపరుడు' సుభద్రగారి కథానిక చాల బాగుంది. కథ విషాదాంతమై కన్నీరు తెప్పించింది. వాస్తవిక జీవితంలో జరిగే యథార్థ గాథలను కళ్లకుకట్టినట్లు రచించిన రచయిత్రి అభినందనీయురాలు. తన స్వార్థంతో అమాయకురాలైన అబలను హింసించి, పసిహృదయం 'పాప' మరణానికి కారణభూతుడైన 'మాధవ్' వంటి వ్యక్తులు నిత్యజీవితంలో తారసపడతారంటే అతిశయోక్తి కాదు. 'అనుమానపుతెర' ప్రవేశించకుండా వుండాలేకాని, అది విష ఫలితాన్ని ఎదురుచూస్తేకాని తొలగిపోదు.' అనే సత్యాన్ని చాటిచెప్పారు రచయిత్రి. బాగుంది కథ.

'జీవనరాగం' సీరియల్ సస్పెన్సులో పెట్టి 'సశేషం' అంటున్నారు. ఈ వారం 'నిరంజనం' అభిప్రాయాలు చాల బాగున్నాయి. పాపం! సీతమ్మ గారు ఏమవుతుందో చివరకు అని బాధగావుంది. 'సుధ' వంట నవ్వు తెప్పించింది. కథ మంచి రసవత్తరంగా నడుస్తోంది.

1—12—67 సంచికలో 'మినియుగం' వ్యాసం హాస్యపూరితంగా వుంది. ఫ్యాషన్లు వెర్రి తలలు వేస్తున్నాయి. వస్త్రధారణలోనే కాకుండా నిత్య జీవితావసరాలలో కూడా 'మినియుగం' వచ్చేస్తోంది.

వరణాశి జానకీదేవి (అమలాపురం)



# ఉత్తరాలు

## వ్యాసాలు

ఈ వారం మీ (మా) ఆంధ్రసచిత్ర వారపత్రికలో వెలువడిన "కాలేజీలో సహవిద్య అవసరమా" అన్న వ్యాసాన్ని చదివాను. రచయిత్రి పరిస్థితులను యథాతథంగా చిత్రీకరించారు. నేను రచయిత్రితో నూటికి నూరుపాళ్ళు ఏకీభవిస్తున్నాను. సహవిద్యంటూ యొక అడ్డే లేకపోతే ఆడవారి అలంకరణలకు హద్దు ఉండదు.

కందుకూరి రంగనాథకుమార్ (శ్రీకాకుళం)

*   *   *

1—12—67 వీక్లి ముఖచిత్రం ఎంతో వన్నె తెచ్చింది. ముఖ్యంగా వనితాలోకంలోని "మిని యుగం" వ్యాసం చమత్కారంగా నడిచింది. వ్యాసం "మిని"గా యున్నట్లు రచయిత పేరు కూడ "మిని"గానే యుంచారు. క్రొత్త హంగులతో మీ (మా) ఆంధ్రపత్రిక అందరి మన్ననలందాలని కాంక్షిస్తున్నా. మీకు నా ధన్యవాదాలు.

స్వర్ణా సుబ్బరాయుడు (కడప)

## ఒకవారం విపరీతం

ఒకవారం విపరీతంలో 'జోహార్—నింద' చదివి మొదట మహానంద పడిపోయాను. మరికొంత సేపటికి ఏడుపొచ్చింది. ఆనంద మెందుకంటే సినీ ప్రపంచంలో కూడా దేశ దుస్థితిని చూసి విచారించే వారున్నారనీను, దుఃఖం దేనికంటె ఇంత 'చచ్చు పీనుగులతో' కూడిన ప్రభుత్వం అధికారంలో ఎందుకుందాని? ఆ పైమాట ఎందుకనల్సి వస్తోందంటె, ఒక చిన్న ఉదాహరణ: 'విద్యార్థులు ఏదైన కాని పనిగాని చేస్తే వారి తలిదండ్రుల అనుమతిగాని, వీరు చదువుతున్న విద్యాసంస్థ అధికారి యొక్క అనుమతిగాని లేనిదె పోలీసువారు వీరిని 'కస్టడీ' లోనికి తీసుకోరాదట ! దీన్నిబట్టి విద్యార్థి ప్రపంచంమీద ప్రభుత్వానికి ఉన్న గౌరవ ప్రపత్తులూ, పోలీసుశాఖవారి చేతుల్లో ఉన్న అధికారాలు, శక్తులు వెల్లడవుతాయి.

దీన్నే 'డెమొక్రసీ' అంటారు గవాల్ను.

డి. సాయినాథ్ (హైదరాబాద్)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 22—12—'67
శ్రీప్లవంగనామ సం॥ మార్గశీర్షమాసం బ॥ పంచమి

సంపుటము : 60 సంచిక : *16*

స్థాపితము :
**1908**

ముఖ్య సంపాదకుడు :
**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు
**శివలెంక రాధాకృష్ణ**

**ఆంధ్రపత్రిక కార్యాలయము**
**7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1**


పోస్టు ద్వారా (1-1-1968 నుండి)

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : క్రీస్తు జననం
రచన : శ్రీ గెనిసెట్టి

నీకు సాయం చేద్దామనే వుంది, కాని, పార్లమెంటరీ బోర్డు నా చేతులు కట్టేసింది

బెంగాల్ పాలనలో బరువు బాధ్యతలు

పి.సి.ఘోష్

బెంగాల్ కాంగ్రెస్

అతను నన్నూ లక్ష్యపెడతాడా?

కాంగ్రెస్ అధ్యక్షుడుగా నిజలింగప్ప ఎన్నిక






## తను చేసిన తప్పుల్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రభుత్వం తెరచాటు పద్ధతి

# పార్లమెంటులో సారం లేని చర్చలు

ప్రభుత్వానికి ప్రతిపక్షంలోని మరికొందరికి ముసుగులో గుద్దులాట జరుగుతున్నది. ఇది ఒక పక్షం రోజులపాటు పార్లమెంటు సమావేశాన్ని పరిశీలించిన తర్వాత తేటతెల్లమైన విషయం. ఇందులో కొత్తదనం ఏమీలేదు. మామూలుగ జరుగుతున్నదే. వందలకొద్దీ ప్రశ్న పరంపరలు కురిపించారేగాని వాటిలో సారంలేదు. సారమైన ప్రశ్నలకి సమాధానమూ లేదు. మనుషుల వ్యక్తిత్వాన్ని ఎట్టిపెట్టడానికి మాత్రం బోలెడంత ప్రయత్నం జరిగింది. కొందరి ప్రబల రక్తాన్ని చవిచూసిన సభ్యులు ఇప్పుడు మంత్రులమీద తిరగబడుతున్నారు. మురికిబట్టల్ని ప్రేలాడదీయడానికి బిగ్గవారు చిలక్కొయ్యగా తయారయ్యారు!

ఇది ప్రభుత్వాన్ని బాధ్యతా రహితంగా తయారు చేసింది. 'హిల్టన్స్' సహకారంతో బొంబాయిలో ఒక హోటల్ నిర్మించాలని ఒక ఉద్దేశ్యం వుంది. శ్రీ ఒబెరాయ్, రాజ్య సభలోని అతని మిత్రులకి దీనిమీద చర్చ ఒక సరదా గుజ్జంలాంటిది. 'ఈ అభిప్రాయం మీద కొద్దిరోజుల్లో నిర్ణయం తీసుకుంటాము' అని రెండు నెలలకోసారి ప్రభుత్వం చెబుతోంది ఇలా నాలుగేళ్లనుంచి చెబుతూ వస్తున్నది న్యూఢిల్లీలో 'పాన్ అమెరికా' సహాయంతో హోటల్ నిర్మిస్తూ, శ్రీ ఒబెరాయ్ ఒక విదేశీయుడికి భారతదేశం హోటల్ పరిశ్రమలో చోటిచ్చారు. యూరప్‌దేశాల్లో 'హిల్టన్స్'కి ఎంత పేరు ప్రఖ్యాతులున్నాయో మన టూరిసమ్ మంత్రిగారికి తెలియందికాదు. అమెరికాలోను ఆశియాలోను ఆ పేరు, యాత్రికులని ఎంతగా ఆకర్షిస్తుందో కూడా తెలియందికాదు. హిల్టన్స్‌తో ట్రాన్స్‌వరల్డ్ ఎయిర్ లయిన్స్‌కి సంబంధం వున్నదని, న్యూఢిల్లీ హోటల్ పాన్ అమెరికా ఔదార్యంతో యాత్రికులని ఆకర్షిస్తున్నట్టుగానే, అది కూడా ట్రాన్స్‌వరల్డ్ ఎయిర్‌లయిన్స్ సహాయంతో పలుకుబడి సంపాయించుకున్నదని మంత్రివర్యులకు తెలిసిన విషయమే. కొద్ది కాలం క్రితం లండన్ 'ఫైనాన్షియల్ టయిమ్స్' ప్రపంచంలోని అన్ని పెద్ద పెద్ద రాజధానుల్లోను జీవన పరిమాణం ఎంతెంత వుంటుంది? అన్న దాని మీద పరిశీలించి చూపింది. అందులో 'హిల్టన్స్'ని చాల పెద్ద హోటల్ సంస్థగా జమకట్టింది. అందుచేత మన ప్రభుత్వం ఆ హోటల్ నిర్మాణం కోసం వారాలు మాసాలు కాకుండా సంవత్సరాల కొద్దీ యోచిస్తున్నది! ఒక మంత్రిగారు గుత్త వ్యాపారాన్ని అణగ ద్రొక్కాలని చూస్తువుంటే, మరో మంత్రిగారు హోటల్ పరిశ్రమలో ఒబెరాయ్ గుత్త వ్యాపారాన్ని ప్రేరేపిస్తున్నారు!

## లెక్కతేలని మంత్రుల విదేశపర్యటనలు

పార్లమెంటు సమావేశంలో క్రిందటి వేసవిలో విదేశయాత్రలకి వెళ్ళిన మంత్రుల భోగట్టా గురించిన ప్రశ్న వచ్చి వుంటుందనుకోవడంలో అనుమానంలేదు. వచ్చింది. ప్రభుత్వం దగ్గర 'రెడిమేడ్' సమాధానం ఒకటి ఎప్పుడూ సిద్ధంగా వుంటుంది. 'మంత్రుల విదేశ పర్యటనలకి సంబంధించిన వివరాలు సేకరిస్తున్నాం, కొద్దిరోజుల్లో మీ ముందు వుంచుతాం' అని ప్రభుత్వం సమాధాన మిచ్చింది. కార్లని గురించిన ప్రశ్నకి కూడా అదే విధమైన సమాధానం వచ్చింది.

పార్లమెంటులో ఒక ప్రశ్నకు జవాబు చెప్పడానికి పదిరోజులు చాలు. ఈ సమావేశ కాలం మొత్తంలో విదేశయాత్రలకి వెళ్ళిన మంత్రుల లెక్క తేలలేదంటే అంతకంటె అసమర్థత ఇంకేముంది ?

ఒకవేళ ఆ వివరాలు ప్రధానమంత్రిగారి స్వంత సచివాలయంలో లభించకపోతే ప్రభుత్వం పత్రికాసమాచార శాఖలో తప్పక లభించివుండేవి. అక్కడ విదేశాలకివెళ్ళిన మంత్రుల కాలనిర్ణయ పట్టికలు జాగ్రత్తచేసి వుంచుతారని, సత్వర సమాధానం వస్తుందని ప్రభుత్వానికి తెలియదా? పోనీ అదీ కాలేదనుకుంటే, 'ఎయిర్ ఇండియా' కావలసిన వివరాల్ని తప్పక అందజేసి వుండేది కదా!

ఇక్కడ మన అందరికీ సులభగ్రాహ్యమయ్యే విషయం ఒకటుంది. తీవ్రమైన వాదోపవాదాలనుంచి, చర్చలనుంచి చాటుకు తప్పుకోవడానికి ప్రభుత్వం బాధ్యతారహితమైన పన్నాగాలు పన్నుతున్నది. మంత్రుల విదేశ పర్యటనలగురించిగాని, వారు వారు ఉపయోగిస్తున్న కార్లని గురించిగాని, ఏ విధమైన సమాధానం వచ్చినా తద్వారా ప్రభుత్వం తప్పక విషమపరిస్థితుల్లో చిక్కుకుని వుండేదన్నమాట నిజం!

## విరాళాలు అవిరళంగా వుండగా అప్పెందుకు?

బీహార్‌లో క్షామాన్ని ఎదుర్కొనడానికి ప్రధానమంత్రి చాలా అప్పుచేశారు. ఇతర విషయాలతోపాటు ఇది కూడా విదేశీయుల వదాన్యతతో తట్టుకుని వుండేవాళ్ళము. ఆస్ట్రేలియా, అర్జంటైనా, కెనడా, ఇటలీ, అమెరికా, సాల్‌మరినో, గ్రీస్, రష్యాదేశాలు దాదాపు పదిహేను లక్షల టన్నుల గోధుమని ఉదారంగా ఇచ్చాయి. ఆస్ట్రేలియా, కెనడా, ఇటలీ, కువాయిట్, ఫ్రాన్సు, స్పెయిన్‌లనుంచి నలభయ్యెనిమిది వేల టన్నుల గోధుమపిండి వచ్చింది. జపాన్, ఇటలీ, వాటికన్, బ్రజిల్, కంబోడియా, ఇరాన్, స్పెయిన్, వెనిజులా, థాయ్‌లాండ్, నెదర్లాండులనుంచి యాభై రెండు వేల టన్నుల బియ్యం వచ్చింది. ఇవన్నీ పైసా ఖర్చు లేకుండా బహుమానంగా వచ్చాయి.

## సమ్మెలు పనివాడి జన్మహక్కు!

1967 లో 'ఇండియన్ ఎయిర్‌లయిన్స్ కార్పొరేషన్' సమ్మెవల్ల ఇరవై లక్షల రూపాయిల నష్టంవచ్చింది. అక్టోబరువరకు 'ఎయిరిండియా' సమ్మెవల్ల దాదాపు పదిహేనులక్షల రూపాయిల నష్టం వచ్చింది.

ఇటీవలి సమ్మెవల్ల రోజుకి నాలుగులక్షల నష్టం!

జీతాలు పెంచడంవల్ల 'ఐ. ఎ. సి'కి 150 లక్షలరూపాయలు, 'ఎయిరిండియా'కి 80 82 లక్షల రూపాయిలు అదనంగా లెక్క తేలుతున్నది.

ఈ సమ్మెని ప్రయోజనాత్మకంగా నెరపడంలో కృతకృత్యులయినవారు లాలా గుల్జారీలాల్‌నందా. 'ఎయిర్ లయిన్సు'లో ఎన్నడయినా సమ్మెలు తటస్థించినప్పుడు అత్యవసర పరిస్థితుల్లో ఆదుకోడానికి 'ఎయిర్ ఫోర్సు'లో సుశిక్షితులయిన వారుండాలని ఆయన ఒక ఏర్పాటు చేశారు. 'సమ్మెలు పనివాడి జన్మహక్కు' అనే మంత్రాన్ని లాలాజీ ఉపదేశించినట్టయింది. అందుకోసమే ఆయన ఢిల్లీ పోలీసుల సమ్మెని కూడా సమర్థించారు. తత్ఫలితంగా కొందరి పోలీసువారి జీవితాలు నాశనమయ్యాయి.

## భారతదేశంలో నిపుణుల కొరత

దుర్గాపూర్ ఉక్కు కర్మాగారాన్ని పరిశీలించడానికి బ్రిటిషువారు భారతదేశానికి రాబోతున్నారు. ఈ నిపుణులు తమ రిపోర్టులని పంపిన తరువాత మరో పెద్ద నిపుణుల సంఘం తరలి వస్తుంది!

రూర్కెలా ఉక్కు కర్మాగారానికి ఒక జర్మనుసలహా దారుణ్ణి కూడా ఏర్పాటుచేశారు.

## బెంగాల్ ప్రజల దురదృష్టానికి కారకులెవరు?

'ఒక సాధారణ పౌరుడు తుపాకీ కొసన వుండాలి. అతని నోరు విప్పడానికి ఎప్పుడూ అవకాశం ఇవ్వకూడదు' అన్నది మానవుని విషాదజీవితం! దేశానికి ప్రధాని ఎవరవుతారు? ముఖ్యమంత్రిగా ఎవరొస్తారు? అనే విషయం మీద రోడ్డుమీద ఒక మనిషి అంతగా ఆలోచించడు. అయినా, కలకత్తాలో అమాయక ప్రజలందరూ కాల్చి చంపబడ్డారు! సాధారణ పౌరుడికి 'యునైటెడ్ ఫ్రంట్' దగ్గరచుట్టమని ప్రజలు నమ్మారు. తత్ఫలితాన్ని అనుభవించారు. ఈ ప్రభుత్వం సామాన్య ప్రజకి చుట్టం గనకనే రద్దు చేయబడింది అని నమ్మించడానికి ప్రయత్నం కూడా చేశారు! కమ్యూనిస్టులు, కాంగ్రెసులోని వారి మిత్రులు బెంగాల్ ప్రజల దురదృష్టానికి కారకులు. ఉధృతంగా పెరుగుతున్న నిరుద్యోగానికి కూడా వారే బాధ్యులు. అసలు దుర్గాపూర్ ఉక్కు కర్మాగారాన్ని మూసుకుని పశ్చిమ బెంగాల్ గర్వించాలి.

దాని నిప్పుడు పునర్ వ్యవస్థీకరించడానికి ఎంతో డబ్బు కావాలి, ఎంతో వ్యయప్రయాసలకి ఓర్చాలి. బెర్హాంపూర్‌లో మరో ఉక్కు కర్మాగారం వుంది. దానిని బెంగాలీవారే చక్కగా నిర్వహిస్తున్నారు. దుర్గాపూర్ కర్మాగారాన్ని నడిపిస్తున్న మనుషులు ప్రభుత్వ రంగం పైమీద అసూయపడుతున్నారంటే అందులో అసహజమేమీ లేదు.

పశ్చిమ బెంగాల్ యునైటెడ్ ఫ్రంట్‌ని వైదొలగ జేస్తే ఎదురయ్యే పరిణామాలు ప్రభుత్వానికి తెలియక పోలేదు. గవర్నరు అంతకి క్రితమే కలగజేసుకుని వున్నట్టయితే కమ్యూనిస్టులకి, తదితరులకి ప్రజాజీవితాన్ని విచ్ఛిన్నం చేయడానికి తక్కువ సమయం లభించి వుండేది. పి. సి. ఘోష్ గారు పదవీ విరమణ చేశాక, మరో పదిహేడు మందిని యునైటెడ్ ఫ్రంట్ నుంచి తగ్గించాక ప్రభుత్వం తన మెజారిటీని కోల్పోయింది. అది అజయ్ ముఖర్జీగారిని ఆఫీసులో వుంచడానికి దోహదం చేసింది! ముఖర్జీగారి కోరిక విన్నవించుకోడానికి శాసన సభని సమావేశంకోసం గవర్నరు పిలిచారు. కమ్యూనిస్టులు ఆడుతున్న నాటకాలు ఎరగనివికాదు. డిశంబరు మధ్యవరకు శాసనసభ సమావేశాన్ని నిలిపి వుంచినట్టయితే చిక్కులు చాలా ఎదురవుతాయి.

## ప్రజాస్వామ్యమంటే దవుర్జన్యాలు, ఆందోళనలా?

కాంగ్రెసు పార్టీలో వున్న ప్రజలు కూడా ప్రజాస్వామ్యం గురించి మాట్లాడుతూ వుంటారు. వారు బెంగాల్ చరిత్రని దృష్టిలో వుంచుకుని, అది భారత దేశంలో ప్రజాస్వామ్యానికి గొడ్డలి పెట్టు అంటున్నారు. ఈ ప్రజాస్వామ్యానికి రెండు రకాల నిర్వచనాలున్నాయి. అందులో 'వెస్ట్ మినిస్టర్'ని అనుసరించే వారొకరు. మాస్కో, లేదా పెకింగ్ మార్కు ప్రజాస్వామ్యాన్ని పాటించే వారు మరొకరు. భారతదేశంలో అనుసరిస్తున్న ప్రజాస్వామ్య పద్ధతుల్లో మన కళ్ళకి కనిపిస్తున్నవి దౌర్జన్యాలు, ఆందోళనలు. ఇవి సమ్మెల రూపంలోను, బంద్‌ల రూపంలోను దర్శన మిస్తున్నాయి. తన పార్టీ, శాసనసభలో ఇంకా మెజారిటీతోనే వుందని ముఖర్జీగారు వాదిస్తున్నారు. 'వెస్ట్ మినిస్టర్' మార్కు ప్రజాస్వామ్యం ప్రకారంగా నవంబరు 27న శాసనసభ కలుసుకున్నప్పుడు ఆయనవాదన ఎంతవరకుసమర్థనీయమైనా తెలుస్తుంది. పశ్చిమ బెంగాల్‌లో గవర్నరు ఒక చర్య తీసుకున్నారు. పరిస్థితులు ఎలా వున్నప్పటికీ, భారత ప్రభుత్వ వ్యవహారాల్లో అభివృద్ధి, క్రమశిక్షణ కనిపించాలంటే గవర్నరుని కేంద్రం సమర్థించి తీరాలి!

## గవర్నరు చర్యకి మాస్కో ఆక్షేపణ!

పార్లమెంటులోని కమ్యూనిస్టులు, సోషలిస్టులు విశ్వాసరాహిత్య తీర్మానాల రూపేణా బెంగాల్‌లోని అరాచకాన్ని వెనక వేసుకు వస్తున్నారు. పశ్చిమ బెంగాల్‌లో గవర్నరు తీసుకున్న చర్యని మాస్కో ఆక్షేపిస్తున్నట్టు వార్తలు చెబుతున్నాయి.

బెంగాల్‌లో గవర్నరు చర్య ఒక ప్రారంభ దశకి అంతం, కాని అంత్య దశకి ప్రారంభం కాదు! బెంగాల్‌లో, ముఖ్యంగా కలకత్తాలో భద్రతని నెలకొల్పడానికి ఇప్పుడు ఎంతో కృషి చెయ్యాలి అంటే మాస్కో మన సత్వానికి వ్యతిరేకంగా శ్రీమతి గాంధీ ప్రభుత్వం చాలా సమస్యలని ఎదుర్కోవాలన్నమాట! వెనక్కి వేసిన ఏ అడుగయినా సరే, అది భారతదేశం విచ్ఛిత్తికి దారి తీస్తుంది.

## మందుల కొరతవల్ల నిర్దాక్షిణ్యమైన చావులు

డా. రామమనోహర్ లోహియా మరణం గురించి విచారించమని కొందరు పట్టు పట్టారు. మొత్తం ముప్ఫయిమంది డాక్టర్లు ఆయన కోసం పని చేసినట్లు రిపోర్టుల వల్ల తెలుస్తున్నది. డా. రామమనోహర్ లోహియా రోగగ్రస్తులై వున్నప్పుడు హాస్పిటల్లో కనీసం పది మంది రోగులు దురదృష్టంతో బాధపడి వుంటారన్న విషయం దీనివల్ల విశదమవుతున్నది భారతదేశం మార్కెట్లలో లభించక పోవడం వల్ల అనేకమైన మందులు విదేశాల నుంచి ఆయన కోసం తెప్పించారు. ఇది ఒక విషయాన్ని మన దృష్టికి తీసుకు వస్తున్నది. మందులు దొరకనందువల్ల, విదేశాల నుంచి తెప్పించుకునే స్థోమత లేనందువల్ల అనేక మంది రోగులు నిర్దాక్షిణ్యంగా చచ్చిపోతున్నారని అర్థమవుతున్నది!

స్వతంత్ర భారతదేశంలో కాంగ్రెసు ఆదర్శాల పేరుతో వ్యక్తి మర్యాదలు లోటు లేకుండా జరిగిపోతున్నాయి. ముదావహం!

ఈరాత్రి, అన్ని రోజులలా పాఠశాల అయి, ఆదివారం చర్చి అయ్యేమట్టిగోడల తాటాకుల పాకలోనో, మిషన్‌వాళ్ళు ఇచ్చిన అల్పధనంతో ఆవూరి వాళ్ళు ఇచ్చిన అనల్ప హృదయోచ్ఛతో ఏర్పడ్డ మట్టి కట్టడం చర్చిలో, క్రైస్తవమత ప్రచారకులు ఎంతో డబ్బు వెచ్చించి కన్నుల పండుగగా కట్టించిన చర్చిలో రంగురంగుల కాగితాల అలంకరణా, రకరకాల క్రొవ్వు వత్తుల వెలుగులూ ఆనందం— అనంతానందం— పంచి పెడుతున్నాయి.

ఈ తెల్లవారు ఝామున, తక్కువ ఖర్చుతో క్రొత్త బట్టలు కుట్టించుకున్న వాళ్ళూ, ఎక్కువ ఖర్చుతో ఎన్నో రకాలు తయారు చేయించుకున్నవాళ్ళూ, స్త్రీల ఫ్యాషన్లు తెలియని హృదయాలతో— కాలి నడకన బయలుదేరిన వాళ్ళూ, కారుమీద రాగలిగిన వాళ్ళూ, సహానస్నానంలో— శిరస్నానం చేసి, హృదయస్నానం చేయాలని కొంటున్నవాళ్ళూ, ఎక్కడో ఉద్యోగాలు చేసుకొంటూ, అంతకుముందే అమ్మ దగ్గరకు వచ్చినవాళ్ళూ, అమ్మనే చెంతకు చేర్చుకొన్న వాళ్ళూ, అద్దె యిళ్ళలో పోయిన వాళ్ళూ, చేతుల్లో సిగరెట్లతో, చేతులకింద పిల్లలతో, ఇంటిల్లిపాదీ గుమిగూడి బైబిలులో, కీర్తన పుస్తకాలతో హృదయం నిండా సంగీతం నింపుకొని, చర్చిలోకి వెళుతున్నారు.

క్రైస్తవ మతం నాటి క్రిస్మస్‌ట్రీ, రంగు రంగుల కాగితాల అలంకరణలతో, మెరిసే దారాల చుట్టలతో, అలంకృతమైన గ్రీటింగ్‌కార్డుల అందాలతో విద్యుద్దీపాలతో వెలుతురుతో కాంతివంతంగా కనిపించే క్రిస్మస్‌ట్రీ, ఉన్న ఇంటి గదిని కంటి లోపల ప్రతిబింబించుకొని, చర్చిలో ప్రత్యక్షంగా క్రిస్మస్‌ట్రీని చూస్తున్నారు చర్చిలోకి వచ్చినవాళ్ళు.

ఈ శుభసమయంలో అభినందన ప్రాయంగా అందినవీ, అనాహూతిగా అరుదెంచినవీ, బంధు




మిత్రులను జ్ఞప్తికి తెచ్చుకొనే వాళ్ళని, జ్ఞప్తికి రావాలని కోరుకొనే వాళ్ళనీ, ఎన్నోవిధాల వచ్చిన గ్రీటింగ్ కార్డులు, ఆ వాక్యాల అభిమానాలనూ, ఆత్మీయతలనూ చెప్పుతూ, తోవ పొడుగునా శుభం పలుకుతూ ఆ వాక్యాలను ఆర్ద్రభావాలతో, కోమలాత్మత అంతశ్శుద్ధితో పవిత్రాంతఃకరణతో మెలిగేటట్లు ప్రబోధం చేస్తున్నాయి.

అభీష్టం తీర్చగల, అనురాగం పంచగల, ఆత్మీయత పెంచగల ఉదరణ అందించగల, అనంత దయాసముద్రుడయిన దేవుడి ప్రతినిధిని, మహితామూర్తిని, సమితాసమాజ చిరంతన భావిని, ఊహామాత్ర కల్పిత కోమలమనస్విని, మానవుడు హృదయంలోని ఆశలు ఆకాంక్షలు జోడించి ఏకం చేసుకొన్న అదృష్టవ్యక్తిని, క్రిస్మస్ ఫాదర్‌ని, ఆర్ద్రహృదయంతో ఎదురుచూస్తూ ఆగమించాలని ఆశిస్తూ అనుక్షణం ఆవాంఛను, వాంఛోపజీవిని అనుగమిస్తూ వున్నారు చర్చిలో జనం! జీవితపు చర్చిలో శరణార్థులయిన జనం!




ఈరోజు క్రిస్మస్! ఏసుక్రీస్తు జన్మదినం. క్రైస్తవమతం బోధించిన మహాత్ముని పుట్టిన రోజు!

పందొమ్మిది వందల అరవై ఏడు ఏళ్ళకుపూర్వం — క్రీస్తుపూర్వం ఏడు రోజులనాడు క్రీస్తు జననం జరిగింది.

ఆరోజు, పశువుల పాకలో అంతులేని వెలుతురు.

పచ్చని గరికపరకలు పరిచిఉన్న పాకలో బూడిద రంగు, తెల్లరంగు, నల్లరంగు— అనేక వర్ణాలు కలిపి పోయిన వర్ణసమూహం— ఉన్ని దుప్పట్లు కప్పి, కొన్ని గొర్రెపిల్లలు పడుకొని ఉన్న పశువుల పాక.

పర్వత సానువుల్లో పచ్చిక బయళ్ళలో పడుకొన్న గొర్రెలకాపరులు, కనులు మిరుమిట్లు గొలిపే కాంతివలయములు కరుణించిన వాక్కులు విని, లేచి, భుజం మీద దుప్పట్లు వేసుకొని కొంకికర్రలు చేతబుచ్చుకొని కొంకికర్రల్లో గుండెశక్తి చేర్చుకొని కాంతివాక్కులు అనుసరించి పశువుల పాక దగ్గరకు వచ్చారు.

ఆకాశంలో నక్షత్రం! దిగంతాలకు దృగంతాలు పరుపుతున్న నక్షత్రం! వెలుగు వెల్లువకు పుట్టినిల్లయిన నక్షత్రం తీరుతెన్నులు చూచి, ఖగోళ విజ్ఞానం కరతలామలకం అయిన తూర్పుదేశాల మహనీయులు చుక్కచూపిన తోవవెంట ఒంటెలమీద పశువుల పాకదగ్గరకు వచ్చారు.

పశువుల పాకలో కాంతి! ప్రపంచానికి శాంతి ప్రశాంతి ప్రసాదంచే కాంతి! భవిష్యత్తును పరిపాలించే కాంతి! అనంతమైన అందమైన కాంతి!

అక్కడ మేరీ! మాత అయిన మేరీ! కన్యగానే తల్లి అయిన చల్లనితల్లి! ప్రాణికోటి పాపాల క్షాళనం చేసే కరుణామూర్తి! కన్నతల్లి! స్వర్గస్థమైన కృపను గర్భస్థం చేసుకొని లోకస్థం చేసిన పావన మూర్తి! ప్రార్థనతో పరమార్థం ప్రతిష్ఠించుకొన్న పుత్రవతి! దైవదూత దర్శనంతో దూరీకృత శంకా కళంకితుడైన 'జోసఫ్' హృదయాంకితమైన బ్రతుకులో వెలుతురులు పండించుకొన్న పవిత్రమూర్తి! గర్భస్థ కాంతిగోళం తమోవృత లోకానికి సమర్పించిన కరుణామయి.

రోమన్ చక్రవర్తి 'సీజర్ అగస్టస్' సామంత రాజుగా 'హేరోద్' 'యూదు'లను పాలిస్తున్న తరుణంలో 'సిరియా'కు 'సిరేనియస్' అధిపతిగా ఉన్న కాలంలో, మొదటసారిగా తీసుకోబడుతున్న జనాభా

లెక్కలలో వ్రాయబడటానికి, ప్రభుత్వాజ్ఞ మేరకు 'గలిలీ' జిల్లాలోని 'నజరేత్' గ్రామంనుంచి 'జూడయా'లోని 'బెత్లెహెమ్' పట్టణంలోకి భర్త 'జోసఫ్'తోవచ్చిన 'మేరీ', ఆ జనాభా లెక్కలలో రెండు పేర్లే కాక మూడు పేర్లు చేర్చి, అంతేకాక, ఆ జాబితాలలో అందరికంటె చిన్నవాడయిన తన కుమారుడు పేరుకూడా వ్రాయబడటానికి, లోకానికి క్రీస్తును అనుగ్రహించిన తల్లి!

పాకలో పశువులు మేతవేసే తొట్టిలో గడ్డి పరుపుమీద మేరీమాత ప్రక్కలో పసిపాప! లోకానికి కనుపాప! చీకటి జగానికి వెలుతురు, పరిమళం అందించే వెన్నెల పూవు! ప్రేమ కరుణ చిప్పిలుతున్న ముఖంలో కోటిసూర్యాల తేజస్సు! మానవ జీవిత సముద్ధరణార్థం అంకురించిన కాంతికోరకం!

'పెర్షియా' 'రోమ్' 'ఇండియా'ల నుంచి వచ్చిన ముగ్గురు విజ్ఞాన ధనులు, మంచుపడే పర్వత సానువుల్లో వెలుతురు పడి కదలివచ్చిన గొర్రెల కాపరులు, పాకలో క్రిక్కిరిసి వున్నజనం, ఆ పసిపాపను చూశారు

ఆ పసిచంద్రుడి వెలుతురు ముద్ద! అన్ని దిక్కులకు కాంతులు ప్రసరిస్తున్న ముద్దుల మూట!

పాకలో కాంతి! పాకచుట్టూ కాంతిచక్రాలు! దొర్లుతున్నాయి కాంతిచక్రాలు! కదులుతున్నాయి! 'బెత్లెహెమ్' చుట్టూ వెలుగుల వలయాలు! 'ఇజ్రాయెల్' ప్రజలవెంట వెలుతురు ధారలు! 'అరబ్' దేశాలచుట్టూ కాంతులకళ్యాణ వీధులు! ఆసియా అంతటా అనంతకాంతి జ్వాలలు! ప్రపంచమంతటా మయూఖ సంచారాలు! విశ్వం నిండా వెలుతురు నడకలు! కాంతివలయాలు అలలు అలలుగా సాగిపోతున్నాయి తరంగాలు తరంగాలుగా వ్యాపిస్తున్నాయి ఎటు చూచినా వెలుతురు! ప్రాణం తొలినట్లు వెలుతురు! వెలుతురులో మనుష్యులు! మనుష్యుల ముఖములలో వెలుతురు.

ఈ వేకువజామున ఆ వెలుతురు!

ప్రపంచంలో ఎన్నో 'చర్చి'లు! అన్ని 'చర్చి'లలో ఎందరో మనుష్యులు! అందరిముఖాలలో ఎంతో వెలుతురు!

కరుణామయుడు లోకానికి పంచిన దయా కాంతులు!

ఈనాటి వెలుగులు ఈ క్రొవ్వొత్తులు! ఈ వెలుతురు మొలకలు ముఖాలపై ప్రతిష్ఠించే కాంతుల ముద్రలు.

ఆనాటి వెలుతురు, ఈ వెలుతురులోపలికి చొచ్చుకొనిపోయి, ఈ వెలుతురు ముద్రాంతరాత్మలలోకి లోపలికి లోలోపలికి గుండెల్లోకి, హృదయాంతరాళాలలోకి చొచ్చుకొని పోతూవుంది

ఎన్నోచోటులలో ఎన్నో చర్చిలలో ఎందరో మనుష్యుల ముఖాల మీద వెలుతురు. హృదయాలలో వెలుతురు వెలుతురు తీర్చి దిద్దిన జీవితాలు! వెలుతురు ప్రతిబింబిస్తున్న అద్దాలవంటి మనుష్యుల జీవితాలు!

అజీవితాలకు ఈ క్రిస్మస్ మధుజ్యోతి! ●

22—12—87



వారికీ వీరికీ మధ్యని చాలా సంబంధాలున్నాయి. వారు రచించినట్లు వీరు నటిస్తారు. వీరు నటించటానికి అనుగుణంగా వారు రచిస్తారు.— ఇదీ ఈనాడు రచయిత— రచయిత్రులకూ, నటీనటులకూ గల అవినాభావ సంబంధం.

ఈ బంధంతో వారు వీరవటం వీరు వారవటం కూడా కద్దు.

'కలం— మనుషు'ల్ని తీసుకోండి— రచయితలూ, రచయిత్రులూ కొంత కాలమయ్యాక అంటే— బాగా పేరొచ్చినాక, కాకలు తీరక, ఢక్కా మొక్కలు తిన్నాక, పేరు బాగ టాపుకి ఎక్కాక— సినిమారంగంలో ప్రవేశించాలని కుతూహలపడుతూంటారు అంటే— సినిమాకు కథ అల్లటం, ఆ అల్లికకు మాటలు రాయటం, మాటల మధ్య పాటలు కూర్చటం— ఇత్యాది ప్రక్రియలు.

అంచె మీద జరిగే ఇలాంటి అభివృద్ధికి మూడే మూడు ముఖ్యకారణాలు ఒకటి - రచయిత, లేదా రచయిత్రి గొప్ప నక్షత్రకులు కావటం రెండు పత్రికలు ఇచ్చే ప్రోత్సాహం మూడోది— పాఠకులు అపారంగా కురిపించే అమూల్య లేఖావళి.

ఇక వేరే విధంగ ఒక్కసారి అలా పైకి చూడండి— అది తారా పథం అనంత తారాపథాన్నందుకున్న నేటి తారలు, నటులు కేవలం నటనారాధనతో ఆగటంలేదు. అటు నటనాన్ని తల్లిక, ఇటు సాహిత్యలతామనూ కూడా ఏకధాటిగా సేవిస్తున్నారు

ఫలితంగా మనకు ప్రతేక సంచికలలో ప్రత్యేకంగా లభించే కొత్త కొత్త శీర్షికలు:

మీ ప్రశ్నలకు నా జవాబులు

**నా తొలి సినీ— అనుభవాలు**

**నేనూ— నా శ్రీవారు**

**మా పిల్లలు— కుక్క పిల్లలు**

**నా విదేశయాత్ర**

**పిక్‌నిక్**

వీటి మీద ఫాన్స్ (అభిమానుల)కు కలిగే సందేహాలు— "వివాహానంతరం మీరింకా నటిస్తారా? మీ వారికి ఇష్టమేనా?" వగైరా

వీటికి పాఠకుల తరఫున సినీ ఎడిటర్లు తారలతో ఇంటర్వ్యూలు జరుపుతారు. జరిపి సమాధానం రాస్తారు

సినీ నటులంటే నే చెవి కోసుకునేరకం ఫాన్స్ అంటే ఇక నటులు నటీమణులు— రాతా, చేతా, మాటా ఆనేసరికి— ఎన్ని చెవులో!

ఇటీవల— కుటుంబ నియంత్రణ మీదా, ముద్దుల పైనా తారలు అభిప్రాయాలివ్వటం నిజంగా ఒక ముచ్చటే.

వెండి తెరపై వెలుగొందే తారలు తెల్లకాగితాలను నలుపు చెయ్యటంలో ఎవరు ఏదాంలో ఏదో విశేషం ఉండే వుంటుంది

ఇది అటుంచి— సబ్బులు, స్నోలు, పౌడర్లు, హెయిరాయిల్సు, సిగరెట్లు— ఇవి నటీనటుల ఊహచేత ఎంతయినా ఉబ్బు వేసుకుంటాయి ఇవి గ్రంథస్వీకారం, సమీక్షల లాంటివి

అలాగే జర్నలిస్టులు చిత్రాల మీదా, తారల మీదా ఫాన్సుకు మోజు కలిగిస్తున్నారు. ఇది పత్రికలు వేసే ముద్ర

అదేదో రసాయనిక ప్రక్రియలో - అటునించి ఇటూ ఇటునించి అటూ చర్య జరగటం లాగా— ఇటు రచయితలు అటు సినిమాల్లోకి వెళ్లవచ్చు, అట్నుంచి సినీగణం ఇటు రాతకోతల్లోకి దిగవచ్చు. కావలసిందల్లా కాస్త 'లక్కు.'

# వారఫలం

## 22-12-67 శుక్రవారం మొదలు 28-12-67 గురువారం వరకు

**మేషం:** మీకుమున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వృత్తిలో పోటీదారితో పోటీ పెరుగుతుంది. సాంఘిక వ్యవహారాలు బాగా ఉంటాయి ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృషభం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పోటీవారితో మాటపట్టింపులు తగవు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**మిధునం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి రాజకీయవ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు ఫలిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది విలాస వస్తువులు కొంటారు.

**కన్య:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి ఆర్థిక వ్యవహారాలు వాంఛనీయంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి అధికవ్యయం జరుగుతుంది.

**తుల:** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది ఆర్థిక వ్యవహారాలు వారంమధ్యలో బాగా ఉంటాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో చికాకులు యేర్పడతాయి. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

**ధనుస్సు:** వృత్తివ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణిస్తుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు

**మకరం:** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి ఉద్యోగంలో మెప్పుకు రాని కార్యభారాన్ని వహిస్తారు. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:—కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కుంభం:** ఆదాయంమాట యెలాగఉన్నా, అన్నివ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. అధిక వ్యయం జరుగుతుంది

స్త్రీలకు.—ఆరోగ్యం బాగా ఉండదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మీనం:** మీకు యిష్టం లేకపోయినా, యితరుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

—మహేష్

# "జలుబును పోగొట్టుటకు నేను విక్స్ వేపొరబ్‌ను నమ్ముకొంటాను"

"ఈమధ్య మా అబ్బాయికి ఎక్కువ జలుబు చేసి సులువుగా ఊపిరితీసుకోలేక పోయేవాడు. నేను వానికి ఎన్నో రకాల మందులను వాడేను. కాని వాటివలన ఏమీ తగ్గలేదు. అప్పుడు, విదేశాలనుండి తిరిగి వచ్చిన మా డాక్టరుగారి చిన్న అబ్బాయి గోపాలం విక్స్ వేపొరబ్ సీసాను యిచ్చి నన్ను వాడమన్నారు. పాపం, అతను మా యింట్లోకి వచ్చి దానిని మా అబ్బాయి ముక్కుమీద, గొంతుకమీద, ఛాతీమీద ఎలా రుద్దాలో కూడ చెప్పేరు. మర్నాడు ఉదయానికి మా అబ్బాయి జలుబు పూర్తిగా పోయి, హాయిగా ఊపిరి పీల్చుకొంటూ లేచేడు.

ఆ అనుభవము తరువాత, జలుబును పోగొట్టుటకు విక్స్ వేపొరబ్ మహా మంచి మందని నేను నమ్ముకొంటున్నాను. నేను ఎల్లప్పుడూ ఒక విక్స్ వేపొరబ్ సీసాను అందుబాటులో ఉంచుకొంటాను."

5 గ్రాముల అకుపచ్చని డబ్బీలలో కూడ లభిస్తోంది.

వాడుటకు సూచనలు: విక్స్ వేపొరబ్‌ను వాడు పడుకోబోయేముందు రుద్దండి.



దానిని వాని ముక్కుమీద, రెండు వైపులా రుద్దండి



...వాని గొంతుక మీద, ఛాతీమీద రుద్దండి



...వాని వీపు అంతటి మీద రుద్దండి కంబళీ కప్పి పడుకోబెట్టండి

## "జలుబును పోగొట్టుటకు మీరూ విక్స్ వేపొరబ్‌ను నమ్ముకోండి"

# మూన్ రేకర్ -12

## జేమ్స్‌బాండ్ బొమ్మల సీరియల్










—ఓహో, సీక్రెట్ సర్వీస్ మనిషి కమాండర్ బాండ్ మనల్ని వెన్నాడుతున్నాడన్నమాట. వెళ్ళి తగ్గ విలువ నిద్దాము క్రెబ్స్.

— కాపిటాన్, బ్రాడ్‌కాస్ట్‌కి టయిమయింది.

రేపు మూన్ రేకర్ ప్రయోగం జరుగుతుంది. సర్ హ్యూగో డ్రాక్స్ గొప్ప దాత...ఇది దేశానికి పెద్ద కానుక. . . .

((ప్రధానమంత్రి ఉపన్యాసం కారు రేడియోలోంచి వినిపించటం విధి విలాసాలలో ఒకటి. కారు వేగంగా ముందుకు వెళ్ళిపోతోంది.)

(ముందు మెర్సిడిస్ తప్పిపోకుండా ఉండటానికి నా బెంట్లీని 90 మయిళ్ళ వేగానికి తోళ్ళాను...)










(95 మ.గం.ల వేగంతో వెడుతున్నాను. అది లీడ్స్ కాసిల్ దగ్గర. ఇంతలో అమాంతంగా ఒక ఆల్ఫా రోమియో కారు నన్ను ఓవర్‌టేక్ చేసింది.)

(నాకూ మెర్సిడిస్‌కీ మధ్య అపరిచితుడు వస్తాడని నేను ఎదురుచూడలేదు.)

—భలే అబ్బాయి! మంచి డ్రయివింగ్!










—మరోడు కాపిటాన్!

(ఈ కొత్త పెద్దమనిషి నన్ను దాటి డ్రాక్స్ మెర్సిడిస్‌ని సమీపించాడు. క్రెబ్స్ అతను నా తరఫున వాడనుకున్నాడు...)

((డ్రాక్స్ మెర్సిడిస్‌ని పక్కకి లాగాడు. హఠాత్తుగా ఇవతలికి తీసుకొచ్చాడు. లోహానికి లోహం తగిలిన భయంకర శబ్దం...)

(... ఏ పాపమూ ఎరుగని ఒక అపరిచితుడు యిలా రోడ్డు అవతల పడి చచ్చిపోయాడు.)












(సర్ హ్యూగో డ్రాక్స్ పోలీసు ఏజెంటు గాలా బ్రాండ్‌ని పట్టుకుని కారు వెనక పడేసి వెళ్ళిపోతున్నాడు . . .)

(మూన్‌రేకర్ ప్రయోగం విషయమయి జర్మన్ నిపుణులు పని చేస్తున్న రాకెట్ స్థావరం వయిపు . . .)

(తన పని కావటానికి చంపేందుకయినా వెనుదియ్యనివాడు సర్ హ్యూగో అని గ్రహించాను. ఇతను నేరస్తుడా, పిచ్చివాడా? గాలా ఏమి కనిపెట్టిందో నాకు తెలీదు . . . . కాని, అన్నిటికీ సిద్ధపడి ఉండాలి . . .)










(వేట జోరుగా సాగుతోంది...)

(నేను ఎలాగో డ్రాక్స్‌ని ఆపి మూన్‌రేకర్‌ని కాపాడాలి . . .)

(. . . .మిస్టర్ బాండ్ పని పట్టించే అవకాశం ఇదిగో. . . .)

—క్రెబ్స్ నీ కత్తి బయటికి తియ్యి!













(అది న్యూస్ ప్రింటు చుట్టలు తీసుకుపోతూ లారీ. దాని వెనుక డ్రాక్స్. అతని అనుచరుడు క్రెబ్స్ ఒక పెద్ద సాహసానికి ఒడిగట్టాడు...)

(కారు లారీని సమీపించగానే దాని బానెట్‌మీదికి పాకాడు...)

(నేను వారికి బాగా వెనకాల ఉన్నాను గాని ఏమయినా పట్టుకుందామనుకున్నాను.)

—క్రెబ్స్! దూకు!

(ఇంకా ఉంది)

# చికాకుగా ఉందా? అజీర్ణంవల్లనే కావచ్చు

మీ జీర్ణశక్తి పోయినప్పుడు ప్రకోపాన్ని చెందుతారు. ఉత్సాహం తగ్గిపోతుంది నిలకడగా ఆలోచించలేరు. వ్యావహారికులైన మీవంటివారు పోగొట్టుకో తగరు. హ్యూలెట్స్ మిక్స్చర్ వాడి జీర్ణశక్తిని తిరిగి తెచ్చుకోండి. శీఘ్రంగా అమోఘంగా పనిచేయును. కడుపులో ఇది రక్షణ పూతగా ఏర్పడుతుంది. బాధ కలిగించే ఆమ్ల రసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరించును.

హ్యూలెట్స్ మిక్స్చర్ చంటి పిల్లల జీర్ణాశయరోగములకు కూడ మంచిది.

విరేచనములకు నల్లమందు కలిపిన హ్యూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి.

C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
86/ A వయనియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-3






JWT/CJH-3233

## హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును




**పి. వి. ఎల్, బరంపురం**

మానవులలోని బలహీనతలు నశించాలంటే వాళ్ళు ఏం చెయ్యాలి?

సత్సంగ పరిత్యాగం.

**కె. వి. ఎస్, బరంపురం**

ఓ వాలు చూపులదానా, వయ్యారి హంస నడకలదానా... మిమ్మల్ని కాదులెండి. రోడ్డు మీద పోయే దాన్ని చూసి అన్నారనుకోండి. అప్పుడామె అతగాణ్ణి ఏమి వర్ణిస్తుంది, లేకుంటే ఏం చేస్తుంది?

ప్రౌఢ అయితే 'పోవయ్యా ముయ్యారా' అంటుంది ముగ్ధ అయితే బెదిరించి నడిచి పోతుంది ఏ అప్పగారో అయితే ఏంకావాలి నాయనా? అంటుంది.

**పి వి. ఆర్, రాజమండ్రి**

మా ఊళ్ళో ఒక థియేటరులో ఐదు తరగతులున్నాయి. నా దగ్గిర సొమ్ము మొత్తం రెండూ డెబ్బయి. ముగ్గురం టిక్కెట్లు కొనుక్కోవాలి. అది సరిగ్గా సరిపోయింది ఏ ధర టిక్కెట్టుకి వెళ్ళి ఉంటాం రామలక్ష్మిగారూ.

వెళ్ళిన తొందర పైసల టిక్కెట్టుకింద లెక్క వుకా వీరభద్రరావుగారూ!

**బి. ఎస్, కడప**

నాకు దేవుడంటే చాలా భక్తి. నేను ఏపనిచేసినా ముందు దేవుని దగ్గిరకిపోయి తరవాత ఆపని చేసేదాన్ని. అంతా నన్ను ఒకటే హేళన చేసేవాళ్ళు. నాకు చాలా బాధగా ఉంటుంది. ఏం చేయాలి?

ఒకళ్ళు హేళన చేసినంత మాత్రాన మీ నమ్మకం పోయిందా? 'న పద్ధతి నాది' అని బదులు చెప్పేస్తే పోయేదానికి బాధ పడడం దేనికి?

**ఇ టి. ఆర్. ఆర్, కావలి**

స్త్రీకి నిర్వచనం?

స్త్రీయే!!

**జి జె. పి, రాయకుదురు**

పాపం పుణ్యం అంటే ఏమిటి?

మాసుగాలు మనుష్యుల మధ్య వాటి అర్థం చాలా సింపుల్. ఎదుటివాడి మనస్సు నొప్పించకపోవడం పుణ్యం, నొప్పించడం పాపం.

**వి. కె, కరీంనగరు**

నేను ఒకరోజున తప్పుపని చేశాను మరు చటిరోజు క్షమించమని గుడికి పోయాను. గుడిలో నా చెప్పులు ఎవరో దొంగిలించారు. అంటే భగవంతుడు నన్ను శిక్షించాడంటారా?

చెప్పులు పోవడంతో చేసిన తప్పు కడుక్కుపోతే, హాయిగా చెప్పులు పారేస్తూ ఉండవచ్చుగా.

**టి. ఆర్, విజయవాడ**

పెళ్లి చేస్తే బరువు తీరిందనుకుంటారు కదా, పురుళ్లు పుణ్యాలు తీర్చడం బరువు కాదా?

ఏసలో మనమాట, పురిటి ఖర్చులు భర్త కదా పెట్టుకోవాలి!

**పి. ఎస్. ఆర్, ఆమదాలవలస**

మేము వ్రాసే ప్రశ్నలకు మీరే జవాబులు యిస్తున్నారా? లేక వేరెవరైనా యిస్తున్నారా? తెలుపవలెను.

నేనే యిస్తున్నానని తెలిపితిని.

**బి. ఎల్. ఆర్, హైదరాబాదు**

వ్యాసాలు మొదలైనవి బుక్‌పోస్టులో పంపవచ్చా? రిజస్టరుగా పంపాలా? లేక అక్కయ్యగారికే ఆ రాసే అధికారం దత్తమైపోయిందా?

మేటరు లోపాటు ఉత్తరం జతపరుచకపోతే బుక్‌పోస్టులో పంపవచ్చును రచించే పక్క ఏ ఒక్కరికో దత్తమైపోతే తొలిగించుయిత ఎవరో వారికే ఆహక్కు దత్తమైపోయి ఉండేదిగ చెల్లెలా!

**పి. ఏ. ఎస్. పి, హైదరాబాదు**

కుళాయినీళ్లు పట్టుకుని 'ఇవి మడినీళ్ళు' అని ఎవరినీ తాకనీయకుండా నిష్ఠగా ఉండే వాళ్ళనుచూస్తే నవ్వాలో ఏడవాలో తెలియడం లేదు

అలాంటివాళ్లే నిజంగ ముందడుగు వేసినవాళ్ళు లేకుంటే ఇప్పటికి ఏ గుంటలో నీళ్ళో తెచ్చుకుని 'మడి' అంటూ కూర్చొరా

**జి. జి. ఎల్, మదనపల్లె**

ఒకరిపై ఎక్కువ మమతలు పెంచుకోవడం శ్రేయస్కరమా?

శ్రేయస్కరమైతేనే ఆమమతను పెంచుకుంటే సరి!

**సి. ఐ. ఆర్, కవుతవరం**

మీరు కలం స్నేహం చేస్తున్నారని విన్నాను నిజమేనా?

ఆఁ నాకలంతో మాత్రమే!

**ఎ. ఎస్. ఆర్, హైదరాబాదు**

సాధారణంగా బట్టతలవాళ్ళు మేధావంతులు, అదృష్టవంతులు అవుతారన్నది నిజమేనేమో అనిపిస్తూంది. మీ ఉద్దేశ్యం ఏమిటి?

బట్టతలవారికి తెలివి సమయస్ఫూర్తి ఎక్కువని ఈకథ చెప్తాడు ఈసప్ వెనకటికో బట్టతల పెద్ద మనిషి విగ్గుపెట్టుకొని చెకచెక పోతున్నాడుట ఆ విగ్గు కాస్తా గాలికి ఎగిరి పడింది ఆ దృశ్యం చూసి నవ్విన వాళ్లతో "ఆ జుట్టు స్వంతదారుని తలమీదే నిలవలేదు, నాతలమీద నిలుస్తుందా?" అంటూ నవ్వేశాడుట.

**ఎస్. ఎల్, బెంగుళూరు**

ఉద్యోగరీత్యా బెంగుళూరు వచ్చాను. ఇదే నేను మొదటిసారి ఉద్యోగంలో చేరడం. మా వాళ్ళు జ్ఞాపకం వచ్చి దిగులుగా ఉంటూంది.

ఈ రోజుల్లో ఆడపిల్లలు సహితం పరాయి ఊళ్లలో ఉంటూ హాయిగ ఉద్యోగాలు చేసుకుంటున్నారు. మీకు బెంగెందుకు? అలవాటైపోతే అదే బాగుంటుంది

**ఎస్. ఎస్. ఆర్, తిరుమల**

మన పూర్వీకులు బ్రిటిషు పాలనలో ఇంత నీతినిజాయితీలు దిగజారిపోలేదు. అప్పుడు జీవితం ఎంతో బాగుండేదని అంటారు ఎంతవరకు నిజం ?

అప్పుడున్న లోపాలు అప్పుడూ ఉండేవి కాని తెల్లదొరలకింద బానిసత్వంకంటే ఇప్పటి లోపాలు జులుపు గుడ్డిలో మెల్ల కాదా!

**డి. ఎస్. ఆర్, కనలకూరు**

నాకు కోపం జాస్తి. ఒక్కొక్కప్పుడు నా కోపంమీద నాకే బలేకోపం వస్తుంది. అది తగ్గాలంటే ఏం చేయాలి?

కోపాన్ని దిగమింగుకోవాలి

**పి. కె. వి. ఎస్. కె. డి, విజయవాడ**

కలం స్నేహం మన నిత్యజీవితమునకు చాల అవసరం అని ఒకరము, అది జీవితానికీ కళంకమని ఒకరము వాదించుకొంటున్నాం. ఏది రైటు?

నిత్యజీవితానికి కలంస్నేహాలకు మించినవి చాలా ఉంటాయి సభ్యతలు దాటని కలంస్నేహాలు కూడా కాలక్షేపానికేగాని నిత్యజీవితావసరం అనికాదు.

# రీటా ఫరియా

# నా అనుభవాలు-2



పారిస్ పార్క్‌లోని విగ్రహంతో తన విగ్రహాన్ని పోల్చి చూసుకుంటున్న రీటా ఫరియా ఆమె ఎప్పుడూ పారిస్ వెళ్లాలనుకుంటుండేది

## బీర్ పిపాసితో సంఘర్షణ

మిస్ వర్ల్‌డ్ అయిన రెండు వారాల్లో ఎంతో కలవర పెట్టే అనుభవాలు కలిగాయి నాకు!

బర్మింగ్‌హామ్‌లో ఏదో కార్యక్రమం ముగించుకుని తిరిగి వస్తున్నాను నాకు తోడు ఎవరూ లేరు నేను ఎక్కిన రయిలు పెట్టెలో ఇంకొక వ్యక్తి మాత్రమే ఉన్నాడు తాగి ఉన్నట్లు కనిపించాడు

నాకు తాగుడంటే అసహ్యంలేదు. (ప్రపంచ సుందరి కాక ముందు నేను అసలు చుక్కపోసి ఎరుగను కాని తర్వాత మాత్రం (బ్రాందీ, వెరుమ్మోత్, షాంపేన్‌ల లోని మాధుర్యం తెలుసుకో గలిగాను) అయితే, మనిషి మరీ మద్యోన్మత్తుడయి ఉన్నట్లు కనిపించాడు. బీర్ కంపుకొడు తున్నాడు

అతని కళ్లు నా మీదే ఉన్నాయి అయితే ఏమిలెమ్మనుకుని నేను తెచ్చు కున్న పుస్తకంలో మునిగిపోయాను

కొంత కాలం గడిచింది. అతను ఉన్న చోటు వదిలి వచ్చి నా పక్కనే కూర్చున్నాడు.

బీర్ సెగలు నా మీదకి ఊదుతూ, 'ఆహా, మిస్ వర్ల్డేనా? చాలా చక్కగా ఉన్నావు నువ్వు!' అన్నాడు ముద్దమాటలతో.

ఇంకా ఏమేమో అన్నాడు కాని నాకేమీ అర్థంకాలేదు చివరికి నా చుట్టూ చేతులు వెయ్యటంతో సందేశం బాగా తెలిసి పోయింది

వెంటనే లేచి భోజనం పెట్టెలోకి నడిచివెళ్లాను అదృష్టవశాత్తూ ఆ కంపార్టు మెంటుకి కారిడార్ ఉంది

నా ప్రియుడు నన్ను వదలలేదు తనూ తూలుకుంటూ వెంటవచ్చాడు. కాని, నేను

కూర్చున్న చోటుకి వచ్చెయ్యకుండా తలుపు దగ్గరే ఆగిపోయాడు.

ఇదంతా గమనిస్తున్న పెద్దమనిషి ఒకాయన సంగతి గ్రహించి నా పక్కనే వచ్చి కూర్చున్నాడు. తను నా 'ఏజెంటు' నన్నాడు. అతని పరిచయం బాగా అభివృద్ధి అయింది కాని పేరు ఇక్కడ చెప్పతలుచుకోలేదు.

తాగుబోతు మమ్మల్ని సమీపించాడు. నా 'ఏజెంటు, మీకేమికావాల'ని అడిగాడు. అతను కొంత తగ్గాడు. 'ఆటోగ్రాఫ్ కావా' లని నణిగాడు.

ఒకటి రాసిపడేశాను. అతనూ వెళ్ళిపోయాడు.

కొంతసేపు తర్వాత లండన్ చేరుకున్నాము. 'నా ప్రియుడి' జాడలేదు వదిలాడు కదా అనుకుంటూ నా కొత్త మిత్రుడి సహాయంతో హోటలు చేరుకున్నాను. సురక్షితంగా గదిచేర్చి అతను వెళ్ళిపోయాడు

ఇవన్నీ గుర్తుకి తెచ్చుకుంటూ ఉంటే నాకు అనిపిస్తూ ఉంటుంది,—

'ఈనేనా ఆ నెమ్మదయిన మెడికల్ విద్యార్థిని కీటాఫరియావి?!' అని.

జీవితంగురించి, మగవారినిగురించి నాకు ఇంత తెలిసేదేకాదు!

కొందరు మగవారు అనుకుంటారు—చిటికవేస్తే, పోట్లు రెపరెపలాడిస్తే చాలు అమ్మాయిలు పరిగెత్తుకుంటూ వస్తారని. వారికీ అభిప్రాయం ఎలా వస్తుందో తెలీదు!

నా చర్మం రంగు నలుపు తెల్లజాతివారి చర్మంతోపోలిస్తే. ఇదొక ఆకర్షణకి కారణం అయి ఉండవచ్చు. ప్రపంచ సుందరినని మరి కొందరికి ఆశ పుట్టి ఉండవచ్చు.

'అంటా' ఎప్పుడో తప్పతాగి స్నేహితులకి వర్ణించాలని వారి ఆశ.

కొందరు పురుషులకి కొందరు స్త్రీలని పొందితేనే కాని తమ ఆకర్షణశక్తి నిర్ధారణకాదనే నమ్మకం ఉండవచ్చు.

కాని—నన్ను మంచం ఎక్కించటానికి డబ్బు వాడుదామనుకుంటే ఎలా ?

ఇటువంటి మగవారు ఇంగ్లండులో ఉంటారని నేననుకోలేదు.

ఒకసారి ఏదో పార్టీకి వెళ్ళాను అందగాడనిపించే ఒకతనికి పరిచయం చేశారు.

కొంతసేపు ఇవీ అవీ మాట్లాడుకున్నాము.

కొనుక్కుందామనుకుంటున్నా డొక మగవాడు !

భారతీయ యువతులకి తొందరగా కోపం రాదు. అది నా అదృష్టం అనిపించింది.

ఏ ఫ్రెంచి, ఇంగ్లీషు అమ్మాయో అయి ఉంటే చేతిలోని గ్లాసులో ఉన్న బ్రాందీ అతని మొహంమీద పలక పోసేది.

ఇంతకీ నేను చేసినదేమిటంటే, మరి కొంచెం బ్రాందీ చప్పరించి 'ఈవిధంగా డబ్బు చెయ్యటం నాకు నచ్చదు' అన్నాను.

'అయితే నువ్వు పెద్ద సంపాదించలేవు!' అన్నాడు అతను వెక్కిరింపు ధోరణిలో.

నేను అక్కడినుంచి నిష్క్రమించాను. అతను నన్ను వదిలి బంగారుజుట్టు ఉన్న మరొక అమ్మాయి దగ్గరికి వెళ్ళిపోవటం గమనించాను.

ఆమెతో అతని అదృష్టం ఎలాఉండిందో?

ఇటువంటి అనుభవాలు నాలోని లౌక్యాన్ని అధికం చేశాయి. అయితే, నా సంఘర్షణలన్నీ మగవారితోనే అనుకోవటం పొరపాటు !

నేను ప్రపంచ సుందరి అయినప్పుడు పత్రికలు 'అందకత్తె, ప్రశాంతంగా కనిపిస్తుంది' అన్నాయి. (నేను మిస్ వరల్డ్ కానని 66 కి1 చొప్పున పందేలు కాశారుట.)

శారీరికంగా నేను అంతగా మారలేదు అప్పటికీ, ఇప్పటికీ నా కొలతలు 35, 24, 35 గానే ఉన్నాయి.

కాని, ప్రశాంతత మాత్రం కొంత కోల్పోయాను.

ఇందులో ఆశ్చర్యం ఏమీలేదు.

దుఃఖం అంటే ఏమిటో తెలుసుకున్నాను. ప్రేమ, సంతోషం ఏమిటో తెలుసుకున్నాను—ఈఅందాలపోటీలో పాల్గొన్నతర్వాత.

## అసలు నేను అందాల పోటీల్లో ఎలా పాల్గొన్నాను ?

నేను పెద్ద అందగత్తెనని నే నెప్పుడూ అనుకోలేదు. ఆ రోజుల్లో నన్నెవరూ ఇలా పొంగాడలేదు.

కొంచెం పీలగా ఉండేదాన్ని—అనుకునే దాన్ని (కాని బొంబాయి విశ్వవిద్యాలయం లోని నా బాయ్ ఫ్రెండ్ అభిప్రాయం వేరయి ఉంటుంది...)

బొంబాయిలోని నా బాయ్ ఫ్రెండ్ నన్ను మేకప్ చేసుకోవద్దనేవాడు. వీధిలోనివారందరూ గుడ్లప్పగించి చూస్తే ఏమి బాగుంటుందనేవాడు

నీ మొహం, నీకు అందం నీమిటంటూ ఉండేవాడు. నాకు రోషంవచ్చి 'మిస్ బొంబాయి' పోటీలో పాలుగొన్నాను.

పోటీ జరిగే కాలంలో అతను ఊళ్లో లేడు. అందుకనే నేనో పత్రికలలో పోటీ ఎంట్రీఫారమ్ నింపిపంపే ధైర్యం వచ్చింది నాకు!

అలా ధైర్యం చెయ్యబట్టే నేను ప్రపంచసుందరి నయ్యాను!

ఇతను మంచివాడే అనుకున్నాను—ఇంగ్లాండ్ ఎలా ఉంది, వాతావరణం ఫరవాలేదా, ప్రపంచ సుందరి బిరుదువచ్చిన తర్వాత ఎలా ఉంది — ఈ ప్రశ్నలు ఎంతో మర్యాదగానే ఉన్నాయి.

హఠాత్తుగా, "మీ ఆదాయం ఎంత?" అని అడిగాడు.

అదేమీ అంత ఎక్కువ కాదు. ఆ సంగతే చెప్పాను. వెంటనే, అతను దీనిని ఎలా ఎక్కువ చేసుకోవచ్చునో వివరించాడు:

ధర ఎంతో, చెప్పమన్నాడు. వందా, రెండు వందలా...ఎందరో మగవారు ఎగిరి గంతెయ్యటానికి సిద్ధంగా ఉన్నారుట.

అంటే తను, ముందు, 200 పవున్లు ఖర్చు చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాడన్న మాట.

'ఊ' అంటే చాలునన్న మాట.

నాకు ఆశ్చర్యం వేసింది. హడిలిపోయాను. నోట మాటరాలేదు.

నేను ప్రపంచ సుందరిని. నన్నిలా

నేను మత్తుమందుల రవాణాలో ఇరుక్కున్నాననే ఆరోపణ చేశారు. నాదేశం వారే నన్ను అసహ్యించుకున్నారు. ఒకసారి విమానం కూలిపోయి చావవలసిన దాన్ని.

ఒకబాయ్ ఫ్రెండ్‌ని పోగొట్టుకున్నాను. ఒక అభిమానిని పోగొట్టుకున్నాను—చిట్టచివరికి నేను పెళ్లి చేసుకుందామనుకునే మగవాడు దొరికాడు నాకు.

పోయిన ఏడు మే నెలలో ఒక భారతీయ జ్యోతిష్కుడు నాకు చెప్పాడు. ఇదంతా వేరే చెప్తాను నేను—ఎలా అందరూ నేను రాతి గుండెదాని ననుకున్నారో, అదంతా.

(ఇంకా ఉంది)




ఆడవాళ్లు ప్రతి చిన్న విషయం సీరియస్‌గా తీసుకుంటారేమో, అని పిస్తుంది. హాస్యం అంటే చాలా చిన్నచూపు కూడా చూస్తూంటారు కొందరు. 'ఈ జీవితంలో అంత నవ్వతగ్గ దేముంది?' అంటూ మూతిముఖం వేస్తారు! ఇలాంటి వాళ్లకి నిజంగానే జీవితంలో నవ్వే సంఘటనలు కనిపించవు ఒకవేళ అలాంటివి కంటి ఎదుట ఉన్నా వాళ్లు గుర్తించ లేరు.

ఇద్దరు మనుష్యులకి ఒకేరకం సమస్య ఎదురవడానికి అవకాశం ఉంది. కాని దాన్ని ఒకరో కరకంగానూ, రెండోవారు యింకో రకంగానూ చూస్తారు. అదే గమ్మత్తు. ఈ కొటేషన్ విన లేదా, 'ఇద్దరు మనుష్యుల ఖైదులు కటకటాల్లోంచి చూశారు. ఒకడు నేలని — మరొకడు నింగిని' అన్నది. అది దృక్పథంలో కేడా మానసిక ధోరణిలో కేడా. కొందరు ప్రతి చిన్న విషయంలోనూ సంతోషకరమైన పక్కనే చూస్తారు. కొందరు విషాదకరమైన పక్కే గాని చూడలేరు.

అన్నీ ఉండీ అందుకు తొగరు లేనట్టు ఆనందించలేని మగువలని ఎందరినో చూస్తూ ఉంటాం. మంచి ఉద్యోగంలో ఉన్న భర్త, రత్నాల్లాంటి పిల్లలు ఇల్లూ వాకిలి అన్నీ ఉంటాయి. అయితేనేం? లేని వాటినే లెక్క వేసుకుంటూ వర్తమానంలో ఆనందం అనుభవించలేని యిల్లాళ్లుంటారు. వీళ్లకి తల్లకిందులుగా ఉండేవాళ్లూ మనకి అడపా తడపా తటస్థపడుతూ ఉంటారు. చిన్న చిన్న విషయాలలో సంతోషాన్నీ సంతృప్తినీ పొందకల్గుతారు వీళ్లు. నిజంగా నేర్పరులైన వాళ్లు వీళ్లు. దైవందిన జీవితాన్ని ఫలవంతం చేసుకుంటూ తమ ఆనంద స్వభావాన్ని తమచుట్టూ వారికి పంచుతూ ఉంటారు.

రోజుకో నవ్వేసంగతే కనిపించదా? జారి పడితే లేవతీయడానికి బదులు ముందు నవ్వొస్తుంది నాకు. కాని మా అమ్మకి ఆ మాటి చప్పామీద చచ్చేటంత కోపం వస్తుంది డబ్బు చేతిలో తక్కువగా ఉంటే ఉత్సాహంగా కాలక్షేపం చేయాలని చూస్తాను నేను. మా నాన్నగారు అందరి మీదా మండిపడిపోతూ ఉంటారు. ఒకొక్క రోజు ప్రతిపనీ విసుగొచ్చేలా చెడిపోతుంది. అప్పుడు తిట్టుకునీ ప్రయోజనం లేదని ఊరుకుంటాం కొందరం. కొందరలా కాదు ఆ కోపం అందరిమీదకీ మళ్లిస్తారు! ఇదంతా అనవసరమేమో అనిపిస్తుంది. ఓ క్షణం ఆలోచించి చూసుకుంటే మనం ఎందుకింత సతమతమైపోయి ప్రతి చిన్న విషయానికి తలక్రిందులైపోతూ ఉంటామా అనిపిస్తుంది. జీవితంలో అలవాటుగా ఊపిరితీయడం దగ్గరనుంచీ సమస్యగా తలపోస్తే ఎక్కడికి తెమిలేను? అందులోనూ యింట్లో ఉండే ఆడవాళ్లకు అడపా తడపా నవ్వుకోని జీవితాలు చాలా భారంగా సాగుతాయి. మనని చూసి మనం ఎప్పుడేనా నవ్వుకో గల్గితేనే ఎదుటి వాళ్లలోని ఉత్సాహాన్ని అర్థం చేసుకో కల్గుతాం. సరదాగా కబుర్లు చెప్తూ అన్నాలు పెట్టే తల్లికి పిల్లలు చేసేది గోల అనిపించదు అల్లరి అనిపిస్తుంది. 'పుట్టినదిలగాయితు నేటి వరకు నవ్వినట్టు లేని ముఖం అతనిది' అంటారు రాచకొండ విశ్వనాథశాస్త్రి ఓ కథలో. ఆ ముఖం నాదికాదు కదా? అని ప్రతివాళ్లూ ప్రశ్నించుకోవాలోకసారేనా!

— కె. రామలక్ష్మి

# డాక్టర్ కబుర్లు

## వ్యాయామం—పరిమితి

ఆమెరికాలో ఈ మధ్య 50 మైళ్ళ నడక ఒక పెద్ద వ్యాయామం కింద కొట్యటం అలవాటయిపోయింది.



12, 13 గంటలలో ఈ 'మార్చ్' పూర్తిచేస్తూ ఉంటారు.

ఇది చాలా ప్రమాదకరం అయినది.

గంటకి 4 మైళ్ల వేగంతో నడవటం మంచి వ్యాయామమే. కాని, ఒకగంట నడిస్తే చాలు. ఇది చదును నేలమీదనే తప్ప ఎత్తుకి ఎక్కే నడకగ ఉండటం మంచిదికాదు. ఎప్పుడు దుర్భరం అనిపిస్తే అప్పుడు ఆపాలి!

పిలవనప్పుడు పంతంకోసం నడవటం మంచిదికాదు. ఇది గుండెకి దెబ్బ తియ్యకలదు.

మిలిటరీ వాళ్ల సంగతి వేరు. వారి వృత్తే అంత. కాని, మామూలుగా కూర్చుని పనిచేసేవారు అతి ప్రయాస పట్టు మితంగ ప్రవర్తించటం మంచిది.

ఇటువంటి వ్యాయామాలు అవసరం అనే వారి దేహస్థితిని పరిశీలించే కన్నా వారి మానసికస్థితి పరిశీలించటం మంచిది!

హెచ్ ఎల్. హార్టన్‌సెన్
(డాక్టరు)







వారందరు ఒకేలాగు లేరు.
కాని, అందరూ సంపూర్ణ
సాధకమగు

## క్రూక్స్ లాక్టో-కేలమైన్

వాడుచున్నారు.

నిష్కళంకమగు సౌందర్యానికి
క్రూక్స్ లాక్టో-కేలమైన్
ఉపయోగించండి

మచ్చలను మరుగుపరచి, కళంకములను కప్పి
పుచ్చగల సంపూర్ణ సౌందర్య సాధకమగు క్రూక్స్
లాక్టో-కేలమైన్‌కు వేరేదియు కోడవసరము లేదు.

మీ సౌందర్యానికి యిదిగో ఒక చిట్కా.

లోపములున్నవని లోలోన క్రుంగిపోతున్నారా?
రోజూ లాక్టో-కేలమైన్ చర్మములో ఇంకునట్లు
మృదువుగా నిమురండి క్రమముగా స్వాస్థ్యమును
చేకూర్చగల కేలమైన్, విచ్ హేజల్
సహాయమున చర్మమున కాంతి యుండి మీ
సౌందర్యమును పెంపొందింపజేయును.

## క్రూక్స్ లాక్టో-కేలమైన్

నిర్దుష్టమగు సౌందర్యానికి

భద్రతకొఱకై వేయబడిన క్రూక్స్ సీలు,
క్రూక్స్ చిహ్నము చూచి మరీ కొనండి.
మీకు లభించే ఇతర సౌందర్య సామగ్రి:
లాక్టో-కేలమైన్ టాల్కమ్ పౌడరు, క్రీము.
క్రూక్స్ ఇంటర్‌ఫాన్ లిమిటెడ్, బొంబాయి-25.






CIL. 72 TL

ఉచితం — స్టాకు వున్నంతవరకు అందమైన 1968 కాలెండరు లాక్టో-కేలమైన్ కొను ప్రతివారికి ఇవ్వబడును.

# 'మహాత్మా ఫూలే నిజంగా మహాత్ముడు' మహాత్మాగాంధీ

[రాజా రామ్మోహన్‌రాయ్, కందుకూరి వీరేశలింగం పంతులు మహాత్మాగాంధీల వంటి వారి సంఘసేవ, సంస్కరణలు గురించి అందరికీ తెలుసు. కాని, 'నిజంగా మహాత్ముడు' అని గాంధీ అన్న జోతి ఫూలె పేరు ఈ ప్రాంతంలో అంత తెలిసినది కాక పోవచ్చు. జోతిబా ఫూలెని తెలుగు పాఠకులకి పరిచయం చెయ్యాలని 'ఎస్' రాసిన వ్యాసాన్ని ఈ కింద వేస్తున్నాము. నేటి దేశీయాంగ మంత్రి శ్రీ చవాన్ ఒకప్పుడు జ్యోతి ఫూలె అనుచరులలో ఒకరుట.]

ఆ అమ్మాయికి పదిహేను సంవత్సరాలు కూడా నిండి ఉండవు. పూనా నగర వీధి ఒకదానిమీద నడిచి వెడుతోంది. అది పొద్దుటివేళ; 1848 సంవత్సరం. ఆమె కనిపించగానే కొందరు బ్రాహ్మణులు ఆమెని దూషించటం ప్రారంభించారు అంతటితో కోపం తీరక మీద మట్టి పోశారు! రాళ్లు విసిరారు... ఆ యువతి బాధ ఇంతా అంతా కాదు కాని, అంత కష్టంలోనూ తన నిలకడని కోల్పోలేదు. మాట్లాడకుండా తన దారిన తనే వెళ్ళిపోయింది. ఆమె ఒక పాఠశాలకి వెడుతోంది. ఆ పాఠశాలని అంతకిముందే ఆమె భర్త స్థాపించాడు. అది హరిజన బాలికల కని నిర్దేశించబడినది. ఈ అమ్మాయి అక్కడ ఉపాధ్యాయిని.

భర్త పేరు జోతిబా ఫూలె. ఈమె అతనికి తగిన భార్య అనవచ్చు. పాఠశాలలో విద్యాబోధన చెయ్యటానికి ఎవరూ ముందుకి రానప్పుడు తనే సాహసంతో ఆ పనికి పూనుకుంది. ఆమె గురువు భర్తే.

అది జరిగిన ముప్ఫయి సంవత్సరాల క్రితం పీష్వా పరిపాలన ముగిసింది. అప్పటికి హరిజను లెవరయినా వీధుల వెంబడి వెళ్లినప్పుడు మెడకి మట్టిపాత్రలు కట్టుకుని నడవవలసి వచ్చేది. వీరు ఈ పాత్రలలోనే ఉమ్మివెయ్యాలి—లేకపోతే పుర వీధులు అపవిత్రం కావచ్చు. ఇటువంటి బ్రాహ్మణ దురభిమానం కల పూనా నగరంలో ఒక హరిజన యువతి ఇంత బహిరంగంగా, నిర్భయంగా హరిజనోద్ధరణ కోసం నెలకొల్పిన పాఠశాలకి నడిచి వెళ్ళటమా! ఇటువంటి వారిని దండిస్తే కదా వారి ఉద్యమాలకి నష్టం! ఆమెని హింస పెట్టిన బ్రాహ్మణుల ఆలోచనలు ఈ విధంగా నడిచి ఉంటాయి.

జోతిబా ఫూలె 1827 లో ఒక బ్రాహ్మణేతర (మాలి) కులంలో జన్మించాడు. తండ్రి గోవిందరావుకి ఒక తోట ఉండేది. అందులో వేసిన పూలమొక్కల, కూరగాయల వ్యాపారం చేసుకుంటూ సుఖంగా బతికేవాడు. 'జోతి'కి, ఒక ఏడాది వయసు ఉండగా తల్లి మరణించింది. తండ్రి మళ్లీ పెళ్లి చేసుకోలేదు. పిల్లవాడిని ఒక దాదికి వప్పగించాడు. ఈ దాది చాలా మంచి ఆవిడ. పిల్లవాడిని ఎంతో శ్రద్ధగా పెంచి పెద్ద చేసింది.

సాధారణంగా ఈ వర్గం వారి పిల్లలకి విద్యాభ్యాసం అంతగా దొరికేది కాదు ఆ కాలంలో. కాని జోతిబా తండ్రి తన కుమారుడిని పంతోజీ అనే బ్రాహ్మణుడు నడిపే బడికి పంపించాడు. అప్పుడు జోతిబా వయసు ఏడు సంవత్సరాలు.

అయితే, ఈ చదువు ఎంతో కాలం సాగలేదు. జోతిబా తండ్రి బ్రాహ్మణ గుమాస్తా తన యజమానితో 'ఈ చదువులు వ్యాపారానికేమి పనికివస్తాయని' చెప్పటంతో కొడుకుని పాఠశాలకి వెళ్లకుండా మానిపించివేశాడు. వచ్చి తోట పనిలో చేరమన్నాడు. జోతిబా తోటపని బాగా చేసేవాడు.

ఏడు సంవత్సరాలు గడిచాయి. జోతిబా పధ్నాలుగవ ఏట సావిత్రి అనే ఎనిమిదేళ్ల అమ్మాయిని ఇచ్చి పెళ్లిచేశారు. ఈ మధ్య జోతిబా తన చదువుని పూర్తిగా అశ్రద్ధ చెయ్యలేదు! పగలంతా పనిచేసి రాత్రి ఇంటికి వచ్చి దీపం పెట్టుకుని చదువుకునేవాడు. ఇతని విద్యాసక్తి పక్కనే ఉండే ఇద్దరిని బాగా ఆకర్షించింది. వారిలో ఒకరి పేరు గఫ్ఫర్‌బేగ్ మున్షీ. ఇతను ఉర్దూ, పారశీకభాషల ఉపాధ్యాయుడు. రెండవవ్యక్తి పేరు లెగిట్. శ్రీ లెగిట్ ఒక క్రయిస్తవ మతప్రచారకుడు.

వీరిద్దరూ కలిసి గోవిందరావుతో కొడుకుని మళ్లీ పాఠశాలకి పంపమని చెప్పారు. జోతి ఒక క్రయిస్తవ మిషనరీ స్కూల్‌లో చేరాడు. ఈ పాఠశాలలో జోతికీ, గవాండె అనే బ్రాహ్మణ బాలుడికీ మధ్య గాఢమైత్రి ఏర్పడింది. ఈ స్నేహం జోతి జీవితాంతం నిలిచింది. జోతి, గవాండేలు ఇద్దరూ ఈ కాలంలో ఎన్నో గొప్ప పుస్తకాలు కలిసి చదువుకున్నారు. వీటిలో థామస్ పెయిన్ రాసిన 'రయిట్స్ ఆఫ్ మాన్' ఒకటి. పాశ్చాత్య విద్యాభ్యాసం ఈ ఇద్దరి జీవితాలలోనూ ఒక నూతన దృక్పథాన్ని సృష్టించింది. కొత్త బాటని సృష్టించింది.

హైందవ సమాజంలోని అన్యాయాలు జోతికి బాగా కొట్టవచ్చినట్లు కనిపించసాగాయి. సమాజాన్ని విచ్ఛిన్నంచేసి, కొందరిని ఘోరంగా అణచివేసే వర్ణాశ్రమ 'ధర్మం' బ్రాహ్మణకులం వారి సృష్టి అనిపించింది అతనికి. విద్యలేని కొరతే తక్కువ కులాలవారి పతనానికి కారణం అనుకున్నాడు జోతి ఫూలె. వారికి విద్య ప్రసాదించే ఉద్యమాన్ని ప్రారంభించడానికి పూనుకున్నాడు.

జోతి ఫూలె విద్యాభ్యాసం పూర్తి చేసుకుని ప్రభుత్వోద్యోగంలోకి వెళ్లి ఉండవచ్చు; రాజా రామ్మోహన్‌రాయ్‌లాగ. కాని, ప్రభుత్వోద్యోగాన్ని నిరాకరించి సంఘసేవకి పూనుకున్న గొప్ప మహారాష్ట్రీయులలో జోతి మొదటివాడు.

జోతి ఫూలెకి ఇరవయిఒక్కఏళ్లు రాగానే సమాజోద్ధరణ ఉద్యమం ఒకటి ప్రారం

భించాడు. హైందవ స్త్రీలని వారి దాస్యం నుంచి విముక్తి చెయ్యటానికి పూను కున్నాడు.

'నిమ్నజాతులు, అందులోనూ హరిజనులు ప్రత్యేకంగా, అజ్ఞానంలో, కష్టాలలో మునిగి ఉన్నారు. విద్యద్వారా వారి పరిస్థితిని బాగు పరిచే అవకాశాన్ని కలిగించాలనే కోరికని నాలో సృష్టించాడు భగవంతుడు,' అని రాశాడు జోతిబా. '1848 లో నిమ్న జాతులవారికోసం ముఖ్యంగా హరిజన బాలి కలకోసం, ఒక పాఠశాల తెరిపించాను. బాలకులు చేరితేమాత్రం అడ్డు చెప్పలేదు.'

ఈ పాఠశాల శ్రీ భిడే అనే బ్రాహ్మణ మిత్రుడి ఇంట్లో పెట్టారు. శ్రీ గోవాండె ఈ బడి నిర్వహణకి తోడ్పడ్డాడు. పూనా నగర బ్రాహ్మణులు దీనిని ఒక పెద్ద అప్రదిష్ట అనుకుని ఎంతో అలబడి లేవతీశారు. బడిలో ఉపాధ్యాయులు చేరకుండా చూసే వారు. జోతి ఫూలె భార్యే స్వయంగా బడిలో ఉపాధ్యాయిని అయ్యేసరికి ఇది నిప్పుమీద ఆజ్యం పోసినట్లయింది. జోతి తండ్రిని వెలివేశారు. ఆతను బ్రాహ్మణ పెద్దల కోపానికి భయపడి కొడుకుని వేరే ఉండమన్నాడు—లేదా బడి మయ్యమన్నాడు. జ్యోతి తన ధర్మనిర్వహణకోసం తండ్రి నుంచి విడిపోయాడు. జోతి భార్య భర్త కోసం బొంతలు కుట్టే వృత్తి మొదలు పెట్టింది.

జోతిబా ('బా' గౌరవాన్ని తెలిపే అక్షరం) బడిలో పిల్లలకి ఉచితంగా చదువు చెప్పేవారు. వారికి బయట ఎక్కడా నీరు ఇచ్చేవారు కాదు. అందుచేత తాగేనీరు కూడా జోతిబాయే సరఫరా చేసేవాడు. చివరికి దుస్తులు, పుస్తకాలూ కూడా జోతిబాయే ఇవ్వవలసి వచ్చేది. ఈ బడి క్రమంగా పెద్దదయింది. మరి రెండు తెరిచారు. 8 మంది విద్యార్థులు 280 మంది అయ్యారు. ఆ కాలానికి ఇది చాలా పెద్ద విషయమే. బుద్ధుడి తర్వాత భారత చరిత్రలో ఇంత ముందంజ ఎక్కడా వెయ్యలేదను కున్నరు చాలామంది.

జోతిబా తన పాఠశాలలని ఒక సమాజం అధ్య క్ష్యం కింద ఉంచాడు. ఈ సమాజంలోని సభ్యు లలో అధికసంఖ్యాకులు బ్రాహ్మణులే. జోతిబా విద్యాభ్యాస పద్ధతిలో ఒక కొత్తదనం ఉండేది. కేవలం ప్రాథమిక విద్య మాత్రమేకాక పిల్లలకి మానవులుగా తమ హక్కుల కోసం పోరాడటం కూడా నేర్పేవారు. ఈ ధోరణి జోతిబా సహోధ్యాయులు కొందరికి నచ్చలేదు. పురాణ గ్రంథాల విమర్శ వారికి రుచించలేదు. వీరి విజ

స్వరూపం బయటపడటంతో జోతిబా విరక్తి చెంది పాఠశాలలని నడిపే సమాజాలని వదలి, వెళ్ళటానికి నిశ్చయించుకున్నడు. అయితే జీవ నోపాధి ఏమిటి? తనూ, భార్య ఇద్దరూ జీతం లేకుండా ఇన్ని రోజులు పని చేశారు! చివరికి జోతిబా స్కాటిష్ మిషనరీ స్కూల్‌లో ఉపాధ్యాయుడుగా చేరాడు.

ఈ కాలంలో అతనిని మరొక సమస్య వేధించేది—వితంతు పునర్వివాహ సమస్య. వితంతువులందరికి పునర్వివాహం నిషేధించబడిలేదు. ఈ నిషేధాన్ని బ్రాహ్మణేతర వర్గాలు అంతగా పట్టించుకునేవి కావు. కాని జోతిబా బ్రాహ్మణ సమాజంలో కూడా సంస్కారాలు కావాలని కోరటం చేత ఈ ఉద్య మంలో పాల్గొన్నడు. ఈ విషయంలో కొందర్ని బ్రాహ్మణ ప్రముఖులు అప్పటికే కల్పించుకుని ఉన్నారు.

మహారాష్ట్రలో జరిగిన మొదటి బ్రాహ్మణ వితంతు పునర్వివాహం— ఒక సారస్వత బ్రాహ్మణ వనితకి—పూనాలో జోతిబా సహాయంతో జరిగింది.

జోతిబా పునర్వివాహ సమస్యతో ఆగలేదు. వితంతువులని మళ్ళీ పెళ్ళి చేసుకోని నిష్కరిపోటం చేత ఏర్పడిన మరొక సమస్య పరిష్కారానికి పూనుకున్నాడు. ఇది వితంతువుల గర్భధారణ సమస్య. గర్భిణులు రహస్యంగా వచ్చి పిల్లలని కనేందుకు ఒక శరణాలయం స్థాపించాడు. దీనివల్ల ఎన్నో శిశు హత్యలు ఆగిపోయాయి అనవచ్చు. జోతిబా ఎంటి సాహసవంతుడే ఇటువంటి పని సాధించగలిగి ఉండగలడని నిస్సందేహంగా చెప్ప వచ్చు. పూనాలో ఇళ్ళ మీద కొన్ని కరపత్రాలు అతికించాడు జోతిబా—

"వితంతువులారా! మీరు ఈ శరణాలయానికి వచ్చి మీ శిశువులని సురక్షితంగా, రహస్యంగా కనవచ్చు! వారి క్షేమాన్ని శరణాలయంవారే చూసు కుంటారు!" అని ఉంది వీటి మీద.

సనాతన బ్రాహ్మణ వర్గాల క్రోధానికి అంతు లేదు.

ఇటువంటి సంస్థని భారతదేశంలో మొదట నెలకొల్పినది జోతిబాయే. (అతనిని తర్వాత కొందరు అనుసరించారు.)

జోతిబా సతీమణి ఇందులోనూ అన్నివిధాలా భర్తకి తోడ్పడింది. శరణాలయంలోని శిశువుల పోషణలో మునిగిపోయింది. తన స్నేహితులని కూడా పిలిచి వారి సహాయం తీసుకునేది.

జోతిబా ఎప్పుడూ ఇతరులకి చెప్పేది తను ముందు చేసేవాడు. తన ఇంట్లో మంచినీటిని హరిజనులు వచ్చి తీసుకోవచ్చునని ముందు ప్రక టించిన తర్వాతనే, అందరూ వచ్చి అతని మంచినీటి పాత్రని వాడటం ప్రారంభించి తర్వాతనే ఉద్యమం తీవ్రతని పెంచాడు.

జోతిబా ఉదారస్వభావానికి మరొక నిదర్శనం—ఒకసారి క్షామం వచ్చినప్పుడు జోతిబా తనకున్న దంతా అమ్మి ఆకలితో మాడుతున్న చిన్నపిల్లలకి అన్నాలు పెట్టించాడు.

1873 లో కాశీబాయి అనే బ్రాహ్మణ వితంతు వుకి గర్భం వచ్చి, పిల్లవాడు పుట్టాడు. జోతిబా ఈ పిల్లవాడిని పెంచుకున్నాడు. (జోతిబాకి ఒక సోదరుడు ఉండేవాడు. అతనికి పిల్లలు ఉన్నప్పటికీ ఇతనినే పెంచుకున్నాడు.) ఇతనికి 'యశ్వంత్' అనే పేరుపెట్టారు. యశ్వంత్‌కి వయస్సు వచ్చిన తర్వాత పెళ్ళి కావడం కష్టం అయింది. చివరికి జోతిబా తన బ్రాహ్మణేతర మిత్రుడు ఒకాయనకి నచ్చచెప్పి అతని కూతురిని ఇచ్చి పెళ్ళి చేయించాడు. తర్వాత జోతిబా తన ఆస్తినంతా యశ్వంత్‌కే ఇచ్చాడు. జోతిబా అంత్యక్రియలు జరిపించే గౌరవం యశ్వంత్‌కే దక్కింది.

* * *

జోతిబాకి రానడె వంటి సంస్కర్తలకి భేదం ఉంది. రానడే వంటివారు సమాజంలోని అన్యా యాలని రద్దు చెయ్యాలనే వారేకాని సమాజాన్నే పునర్నిర్మించటానికి సిద్ధపడలేదు. జోతిబా సమా జంలోని దురాచారాలకి కారణాలయిన సాంఘిక వ్యవస్థలని నిర్మూలించి కొత్త సమాజాన్ని నిర్మించా లనేవాడు. వీటికి ముఖ్యకారకులు బ్రాహ్మణులేనని జోతిబా ఎన్నో పుస్తకాలు రాసి నిరూపించాడు.

1879 లో వ్యవసాయదారుల విముక్తి చట్టం వచ్చింది. వడ్డీ వ్యాపారుల బారినుంచి రయితులని రక్షించటమే దీని ధ్యేయం. కాని, జోతిబా ఫూలే 1869 లోనే ఈ సమస్య పరిష్కారం కోసం ఉద్యమం ఒకటి ప్రారంభించాడు.

1884 లో జోతిబా మరొక ఉద్యమం మొదలుపెట్టాడు. బ్రాహ్మణ భూస్వాములూ, వారి గుమాస్తాలూ కలిసి పెద్ద రయితులని ఎలా మోసం చేసేవారో నిరూపించాడు, అప్పటో



జ్యోతి బా ఫూలె.

## అమూల్ నుంచి క్రొత్త పదార్థము!

# అమూల్‌స్ప్రే

### ప్రోటీన్లు అధికంగాగల బేబీ ఫుడ్




ఏ ఇతర పాల ఆహారంలోను,
శరీర నిర్మాణ ప్రోటీన్లు
ఇంతకు మించి లేవు!





**20 సెకండ్ల లోపుగా కరుగుతుంది...సులభంగా జీర్ణమవుతుంది!**

బిడ్డ తన మొదటి రెండేళ్లలోను బరువును నాలుగు రెట్లు అధికం చేసుకుంటూ త్వరగా పెరగాలి. ఇందుకు ఆధారమైన ప్రోటీన్ అమూల్‌స్ప్రే నుండి లభిస్తుంది, దీనిలో విటమిన్‌లు, ఇతర మంచి పదార్థములు కూడ వున్నాయి

అమూల్‌స్ప్రేలో విటమిన్‌లు వున్నాయి. కార్బొహైడ్రేట్స్, క్రొవ్వు పదార్థములు, లోహపదార్థములు తదితర పోషకత్వపు పదార్థములు కూడ సరితూకమిశ్రమముగా వున్నాయి. నియాసిన్, సోడియమ్ అయొడైడ్, ఫోలిక్ ఏసిడ్ సహజ స్థితిలో వున్నాయి.

**సులభంగా జీర్ణమవుతుంది**

అమూల్‌స్ప్రే, యూరప్, యు.ఎస్.ఏ.లలో చేసే ఉన్నతమైన 'స్ప్రేడ్రైయింగ్' పద్ధతి ప్రకారం చెయ్యబడుటచే బాగా జీర్ణమగుటయే గాక పాలలోని ప్రోటీన్ యొక్క విశిష్టత, ఉత్తమత్వము ఉన్నతస్థితిలో వుంచబడతాయి.

**అద్భుతంగా కరుగుతుంది**

పేస్టు చెయ్యనవసరం లేదు. కావలసిన వేడి నీటిలో అమూల్‌స్ప్రేను బాగా కలపండి. 20 సెకండ్ల లోపుగా మీ బిడ్డకు పాలు తయారవతాయి! పాలపీక అడ్డుకు పోదు.

**మీ బిడ్డకు తగినది అమూల్‌స్ప్రే**



అమూల్‌స్ప్రే మీకు
500 గ్రాముల డబ్బాలు
(1 పౌనుకు పైగా
48 (గ్రాములు)లో లభిస్తుంది

ASP/AS-1/67-TL-R

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

కయిరా డిస్ట్రిక్ట్ కోపరేటివ్ మిల్క్ ప్రొడ్యూసర్స్ యూనియన్ లిమిటెడ్ ఆనంద్‌చే తయారు చెయ్యబడినది
మద్రాస్, కేరళ, ఆంధ్ర స్టేట్‌లలో పంపిణీ చెయ్యబడుతోంది.

తాలూకా రైతుల చేత సత్యాగ్రహం— సాగుబడి చెయ్యకపోవటం— చేయించాడు ప్రభుత్వం వారికి రైతుల కష్టాలని గురించి చెప్పి వారి సహాయం అర్థించాడు ప్రభుత్వం కలుగ చేసుకుని సంధి కుదిర్చింది.

1888 లో కానాట్‌డ్యూక్ పూనా నగరానికి వెళ్లాడు. అక్కడి సంపన్నులంతా అతనికి పెద్ద విందు ఏర్పాటు చేశారు. దీనికి బొంబాయి నుంచి ధనవంతులెందరో వచ్చారు. జోతిబా ఫూలె కూడా వచ్చాడు. అందరూ అతన్ని ఉపన్యసించమన్నారు. ఫూలె లేచి అందరినీ చకితులని చేసే ఉపన్యాసం చేశాడు. అక్కడికి వచ్చినవారిని చూపి భారతదేశం ఆర్థిక పరిస్థితిని నిర్ణయించరాదని హెచ్చరించాడు. విక్టోరియారాణి పాలించే దేశం ప్రతిబింబం ఇది కాదన్నాడు. అసలయిన భారతదేశం గ్రామాలలో ఉందన్నాడు. అక్కడి జనానికి తిండిగుడ్డలు కూడా లేకుండా వారు మలమల మాడి పోతున్నారన్నాడు. ప్రభువులు నిజంగా ప్రజల పరిస్థితిని తెలుసుకోవాలంటే 'మహార్—మాంగ్'ల వంటి హరిజనుల వాడలకి వెళ్లాలని ఫూలె ఉద్బోధించాడు. ఈ సంగతులన్నీ విక్టోరియా రాణికి తెలపమని కానాట్‌డ్యూక్‌ని కోరాడు.

అదే సంవత్సరం పూనా ప్రజలు వేల్స్ రాజకుమారుడికి పెద్ద స్వాగతం ఇచ్చినప్పుడు జోతిబా అనారోగ్యం చేత మంచాన్న పడిపోయాడు కాని, అతని అనుచరులు ఈ అవకాశాన్ని వృథా చెయ్యలేదు. రాజకుమారుడు వెళ్లే దారిలో ఒక పెద్ద బొమ్మ వేశారు. దాని కింద గుంపుగా నుంచున్నారు. దాని మీద ఇలా రాశారు: "ఈ దేశం సంతోషంగా ఉందని అమ్మకి చెప్పొద్దు. 19 కోట్ల మందికి చదువు రాదు!" విదేశీయ ప్రభువులు దీనిని చూసి సానుభూతితో నవ్వుకున్నారు.

1880 లోనే జోతిబా ఫూలె గవర్నర్ జనరల్ లిట్టన్‌కి స్వాగతం ఇవ్వరాదని బహిరంగంగా అన్నాడు. 1885 లో 'దీనబంధు' అనే పత్రికలో బరోడా మహారాజా అయిన శాయాజీరావు గయిక్వాడ్‌కి బహిరంగ లేఖ ఒకటి పద్య రూపంలో రాశాడు. "సోమరి పోతులయిన బ్రాహ్మణులకి ధాన్యదానాలు ఇవ్వకండి! ఇది ప్రజల ధనాన్ని దండుగ చెయ్యడమే! ఈ ధాన్యాన్ని సాగుబడి చేసిన రైతులు ఆకలితో మాడిపోతున్నారు! అరిటాకులు తిని బలిసే పొలం ఎద్దులు ఆకలితో చనిపోతున్నాయి! నటీనటులకి, బ్రాహ్మణులకి వస్త్రదానాలు చేస్తున్నారు! పేద రైతులు వీరికన్నా అర్హులు! వారిని మీరే రక్షించాలి!" ఇది దీని సారాంశం!

ఈ ఉత్తరం ప్రచురించిన తర్వాత గయిక్వాడ్ బ్రాహ్మణులకి ధాన్యదానాలు ఇవ్వటం ఆపివేశాడు.

జోతిబాఫూలె ఎన్నోవిధాల మహాత్మాగాంధి పద్ధతులని అనుసరించాడు. కార్మికోద్ధరణ కూడా అతనికి అత్యంత ప్రీతికరమయినది. బొంబాయికి తరుచు వెళ్లిరావటం చేత మిల్లులలో పనిచేసే వారి కష్టాలు అతనికి బాగ తెలుసు. 'దీనబంధు'

# మహాత్మా ఫూలే...

పత్రిక సంపాదకుడు లోఖండే ఇతని శిష్యుడే. కార్మిక సమస్య పట్ల శ్రద్ధ చూపించిన మొదటి భారతీయ పత్రిక 'దీనబంధు' పనమా! 1880లో లోఖండే, ఫూలేలు ఒక కార్మిక సంఘాన్ని కూడా స్థాపించరు. దీని ద్వారా కార్మికుల కష్టాలని, ప్రభుత్వానికి తెలియజేశారు.

1889 లో జోతిబా ఫూలె అనుచరులు— అతను ఆ సమయంలో అస్వస్థుడయి ఉన్నాడు— బొంబాయిలోని సాకీవారి తరఫున మిల్లుడి వారికి లాభదాయకమయిన ఏర్పాట్లు కొన్ని చేశారు.

'సత్యశోధక సమాజం' 1873 లో పూనా నగరంలో స్థాపించబడింది. దీని మొదట అధ్యక్షుడు జోతిబా ఫూలె 'శూద్రకులం'వారి ఉద్ధరణ దీని ప్రధాన ఉద్దేశాలలో ఒకటి. బ్రాహ్మణుల చెడు బోధల ప్రభావం నుంచి 'అతిశూద్రు'లని రక్షించటం కూడా వీరి ఆదర్శాలలో ఒకటి. "మానవులందరూ ఒక దేవుడి బిడ్డలు. తల్లిదండ్రులకి పిల్లలకి మధ్యవర్తి అనవసరం ఎలాగో దేవుడికీ భక్తుడికీ మధ్యవర్తి అనవసరం. ఎవరికి తోచినట్లు వారు నేరుగా భగవంతుడిని ప్రార్థించవచ్చు. ఈ సిద్ధాంతాలని అంగీకరించే వారందరూ సత్యశోధక సమాజంలో చేరవచ్చు" అన్నారు స్థాపకులు.

ఈ సమాజంలో అన్నివర్గాల వారూ చేరవచ్చు. ప్రారంభ దశలలో బ్రాహ్మణులే కాక యూదులు, మహమ్మదీయులూ కూడా సభ్యులయ్యారు. సమాజం ప్రతివారం సమావేశం అయ్యేది. సంఘ్యమనం, విద్యాభ్యాసం వీటి అవసరాలని చర్చించేవారు సభ్యులు. అంతేకాక, స్వదేశీ వస్తువుల వాడకాన్ని ప్రోత్సహించేవారు. వివాహాల వంటి కార్యాలకి బ్రాహ్మణ పురోహితుల అవసరాన్ని తప్పించే ఏర్పాట్లు చేసేవారు. జ్యోతిష్యం, భూతాలు, పిశాచాలు వీటని నమ్మరాదని ప్రచారం చేసేవారు. కులతత్వం, విగ్రహారాధన తప్పు అని బోధించేవారు. ప్రార్థనలు సంస్కృత భాషలోకాక మరాఠీలో చెయ్యవచ్చు ననేవారు.

జోతిబా అనుచరులు ఈ ఆదర్శాల ప్రచారం కోసం చిన్న చిన్న గ్రామాలకి కూడా వెళ్లేవారు. త్వరలోనే సత్యశోధక సమాజం ఎంతో ప్రజాదరణ పొందగలిగింది. బ్రాహ్మణ వర్గాలు దీనిని ఎదిరించక పోలేదు. కాని, వారి ప్రయత్నాలు విఫలం అయ్యాయి. జోతిబా ఫూలె పాటలు వ్యాసాలు మహారాష్ట్రంలో ఎంతటనో కదల్చి వేశాయి.

జోతిబా మరణం తర్వాత పరిస్థితులు మారాయి. సమాజం తన విశిష్టతని కోల్పోయి మరొక వర్గ ప్రచార సాధనం పోయింది. క్రమంగా కేవలం బ్రాహ్మణ ద్వేషమే ధ్యేయం అయిపోయింది. నేడు సత్యశోధక సమాజానికి మొదట్లో ఉన్న పేరు లేదు అన్నా అతిశయోక్తి కావేరమ!

—ఎస్.






### జరిగిన కథ

కళ్యాణి గవర్నమెంటు హాస్పిటల్లో డాక్టరు. ప్రిస్క్రిప్షన్లకంటే ఆమెకు పుస్తకాల గొడవే ఎక్కువ. మతి చాంచల్యంలో ఒక పిల్లవాడ్ని హత్య చేసిందన్న నేరారోపణపై, పోలీసు ఉద్యోగి ఒకామెను కళ్యాణి దగ్గరకు తీసుకొచ్చాడు. కళ్యాణి ఆమెమీద ఎంతో జాలిపడింది. స్నేహితురాలు లాయరు శాంత సహాయాన్ని కోరింది. శాంత ఆమె తరపున కోర్టులో వాదించడానికి సన్నాహాలు చేసుకుంటుంది. నందూరులో సరళ చెప్పిన పంతుల్ని గురించి సమాచారం కొంత సేకరించారు. పంతులు కోర్టుకి రావడానికి ఒప్పుకుంటాడు. అతను సరళ గురించిన ఒక ప్రేమకథని కోర్టులో చెబుతాడు. సరళ మరొక వయస్సు ముదిరినవాడిని పెళ్ళాడడం, అతను పోవడం, కొడుకును కనడం, కష్టాలు పడడం అంతా వివరంగా చెప్తాడు.

## 8

మర్నాడు ఉదయం స్కూలుకి వెళ్ళాడన్న మాటేగాని ఏపనిమీదా మనస్సు లగ్నం చేయలేక పోయాడు. సాయంత్రం వచ్చేముందు హెడ్‌మాస్టరుకి చెప్పాడు రెండు రోజులు రానని.

ఆ సాయంత్రమే సరళని చూడ్డానికి బయలుదేరాడు. కాలినడకే సులభం అని నడవడం ప్రారంభించాడు. ఊరు చేరేదాకా ఏమీ ఆలోచించని మనస్సుకి ఊరులోకి ప్రవేశించగానే అనేకమైన అనుమానాలు కలిగాయి. ఎవరంటే ఏం చెప్పాలి? అన్న ప్రశ్న అన్నిటికంటే కష్టం అనిపించసాగింది.

కాని ఇంటిముందు ఆగగానే అనుమానాలన్నిటికీ సమాధానం దొరికినట్టు సరళ వీధి తలుపుని ఆనుకుని కనబడింది. వళ్ళో పసివాడు కాబోలు గుక్కపట్టి ఏడుస్తున్నాడు

వీధి తలుపు గడియవేసి ఉంది.

'సరళ' అని స్తబ్ధుగా నిలబడిపోయాడు అతను.

ఎవరా అని యధాలాపంగా చూసిన సరళా అలాగే కళ్ళు అప్పగించి చూస్తూ ఉండిపోయింది.

ఆత్రుతతో దగ్గరికి వెళ్ళాడు.

'రావద్దు. నువ్వువచ్చి నాయీ బాధ ఎక్కువ చేయొద్దు వెళ్ళిపో' అరిచినట్టు అంది సరళ.

ధైర్యం తెచ్చుకుని ఇంకా దగ్గరకి వెళ్ళాడు అతను.

పసివాణ్ణి గుండెలకి గట్టిగా హత్తుకుంది సరళ.

'నీకు మనుషులంటే ఏమిటో తెలియదు వెళ్ళిపో' అంది.

'నిన్ను చూడాలని వచ్చాను. నిన్ను చూసి వచ్చి తాతగారికి చెప్తానని చెప్పాను సరళా. నన్ను వెళ్ళిపొమ్మంటావా?' బతిమాలుతూ అడిగాడు.., 'నీకు మనస్సు బాగులేదు. ఆరోగ్యం బాగులేదు. తాతగారి దగ్గర కొన్ని రోజులు ఉందుగాని' ఓదార్పుగా అంటున్నాడు.

పక్కకిటికీ తెరుచుకుని ఎవరో తొంగి చూశారు, తొంగిచూసి ఊరుకోలేదు.

'తాతగారింటికి ఎందుకు? నువ్వే తీసుకు వెళ్ళు. ఇక నీకు అడ్డేమిటి?' అని ధబాలున కిటికీ మూసుకుంది ఇల్లాలు.

'విన్నావుగా వెళ్ళు. ఈమాత్రంగా కూడా నన్ను బ్రతకనివ్వవా?' ఏడుస్తూనే అడిగింది.

'లే సరళా. నీ కిక్కడేముంది? తాతగారి ఇంటికి రా' లేవతీయబోయాడు సరళని.

దూరంగా జరిగిపోయింది సరళ.

'రెండు రోజులుగా పిల్లవాడికి ఒంట్లో బాగులేదు. మందూ మాకూ వద్దు వాడే ఛస్తాడు. బ్రతికి ఎవరిని ఉద్ధరించాలి అంటున్నారు. ఈ రోజు నన్ను గెంటి తలుపేసుకున్నారు. నే చేసిన ద్రోహం ఏమిటి? చెప్పు. వీళ్ళకి చెప్పు.' ఆవేశంతో అంది సరళ.

'పిచ్చి సరళా చెప్తే నమ్మేవాళ్ళకి అసలు విషయాలు అర్థం అయి ఉండవా? వాళ్ళకి అర్థం చేసుకోవలసిన అవసరం లేదు. నడు. పిల్లవాణ్ణి డాక్టరుకి చూపించిన తరువాతే తాతగారి ఇంటికి వెడుదువుగాని' అన్నాడు పిల్లవాడికోసం చేతులు చాస్తూ.

'నా బాధలు నే పడతాను. నువ్వువెళ్ళి తాతగారితో చెప్పు సరళ సుఖంగా ఉంది. పిల్లవాడికి లాలిపాడుతోంది. అని చెప్పు.' అంది విషాదంగా నవ్వుతూ, ఏడుస్తూ.

అప్రయత్నంగా అతనికీ కంట నీరు వచ్చింది ఆ దృశ్యం చూసి.

'ఎప్పుడేనా నీసహాయం కావలసి వస్తుంది

అప్పుడు వస్తానుగా వెళ్ళు. వెళ్ళిపో. లేకుంటే నేనీ తలుపుకేసి తల బాదుకుని చచ్చిపోతాను' అంది సరళ.

పరిస్థితి బాగా అవగాహన అయింది అతనికి. తానుండి ఏం చెయ్యలేనని తెలుసుకున్నాడు.

'వస్తాను సరళా, నిన్నో కంట కని పెట్టే ఉంటాను' అంటూ వచ్చిన దారినే తిరుగు ప్రయాణం అయ్యాడు అతను.

ఇది జరిగి సరిగ్గా సంవత్సరం అయింది.

సరళ జాడ తెలియకుండా పోయింది.

ఉద్యోగం మానేసి తిరిగి కోవెలకి వివాహం మార్చేశాడు అతను—తాతగారికి హాయిగా ఉండాలని. ఆయన ఆరోగ్యం బాగా దెబ్బతింది.

అప్పుడప్పుడు తుని వెళ్ళడం ఆ చుట్టుపక్కల ఊళ్ళలో సరళకై వాకబుచెయ్యడం తిరిగి రావటం అతని నిర్విరామ కార్యక్రమంగా తయారైనాయి.'

అటువంటి సందర్భంలోనే ఒకసారి విన్నాడు: ఒక పిచ్చిదాన్ని గురించి.

ఆమెకోసం వేచిఉండి చూశాడు. తన కళ్ళని తానే నమ్మలేక పోయాడు.

'సరళా' అని ఆప్యాయంగా పిలిచాడు.

రోడ్డు వారగా తప్పుకు తప్పుకు వెళ్ళి పోతున్న ఆ మనిషి దెబ్బతిన్న మనిషిలా నిలబడి పోయింది.

'సరళా? ఏమిటిది?' అడిగాడు.

మాసిపోయి పేలికలుగా వేళ్ళాడి పోతోంది కట్టుకున్న చీర. సంస్కారంలేని జుట్టు భయంకరంగా ఉంది. అత్యంత సన్నిహితులు తప్పించి ఆమె సరళ అని పోల్చుకోలేరు.

'నా కొడుకు పోయాడు. నేనిప్పుడు పిచ్చిదాన్ని' అంది అతని ముఖంలోకి చూస్తూ.

ఆ చూపులో అర్థంలేదు.

ఆ స్వరంలో వ్యధలేదు.

'సరళ, నాతో రావూ?' చిన్నపిల్లని బ్రతిమాలినట్టు అడిగాడు.

'మళ్ళీనా? నాకింతో హాయిగా ఉంది. నా జన్మలో ఎప్పుడూ ఇంత హాయిగా బ్రతకలేదు చీకూ చింతాలేని జీవితం ఇది. బాగుంది. ఎంతో బాగుంది.' నవ్వుకుంటూ ఎంత పిలిచినా ఆగకుండా వెళ్ళిపోయింది సరళ.

అక్కడ వాకబుచేస్తే తెలిసింది.

'ఈ పిచ్చి ఇక్కడే తిరుగుతుంది బాబుగారూ, ఏంచెయ్యడు' అన్నాడో అమాయకుడు.

ఆ మాటవిని కళ్ళ నీళ్ళు తిరిగాయి అతనికి ఎవరు బాధ్యులు ఈ అఘాయిత్యానికి? అనుకున్నాడు.

తాతగారికి సంగతి చెప్పలేదు. సరళ కోసం వెతుకుతున్నానని చెప్తున్నాడు. అసలే పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న ఆ ముసలి ప్రాణం ఈ దెబ్బకి తట్టుకోలేదని భావించాడు......

* * *

'అదిగో పిచ్చిది. ఆం తినకపోతే ఎం.నిత్యే



# ఆడది

పాను' అని గోరుముద్దలు తినిపిస్తూన్న తల్లి పిల్లని బెదిరిస్తూంది.

దూరంలో చెట్టుకింద ముడుచుకు కూర్చున్న సరళ ఇది వినకపోలేదు. నవ్వు కుంది. పిచ్చిలోకాన్ని చూసి నవ్వుకోక ఏం చేస్తుంది?

'బజ్జో. లేకుంటే ఆ బూచి వస్తుంది' అని పిల్లలని బెదరించి నిద్రపోకొట్టే తల్లులు ఆ ప్రాంతాల ఎక్కువ అయ్యారు.

అయినా సరళ ఆ పసివాళ్ళని దొంగ తనంగానైనా చూడక మానదు. అదొక్కటే ఆమెలో మిగిలిపోయిన ఆశ.

పగలంతా అక్కడా అక్కడా తిరిగేది. ఏతల్లేనా దయదలచి ఇంత అన్నం పెడితే తెచ్చుకుని ఏ చెట్టునీడనో కూర్చుని తినేది. అక్కడే పడుకునేది. మధ్యాహ్నం పూట స్కూలు ప్రాంతాల తచ్చాడుతూ ఆనందం నిండిన కళ్ళతో పసివాళ్ళని తిలకించేది.

మధ్యాహ్నం స్కూలు వదలబోయే సమయానికల్లా అక్కడ చేరేది. ఆ పిల్లల కేకలు, పరుగులు, అల్లరి ఆమెకి ఎంతో ఆనందం కలిగించేవి.

'పిచ్చిది, పిచ్చిది' అని దూర దూరంగా పారిపోయేవారు.

నిశ్శబ్దంగా దూరంలో ఎక్కడో నిలబడి పొంచి చూసేవారు.

సరళకి దగ్గరగాపోతూ కాగితం ముక్కలు చింపి తలమీదపోసి గోలచేస్తూ పారిపోయేవారు.

ఇవన్నీ పట్టించుకోకుండా నిశ్చింతగా కూర్చునేది సరళ. వాళ్ళ అల్లరిలోనే ఆనందం ఆమెకి.

'రాళ్ళు వేద్దామా?' అని ఏ ఒక్కడో అంటే అందరూ 'సై' అనుకుని రాళ్ళ వర్షం కురిపించేవారు. ఎంత తప్పించుకున్నా ఒకటీ అరా తగిలి చర్మం చిట్లి రక్తం వచ్చేది. ముడుచుకుంటూ గబగబ పారిపోయేది సరళ. అప్పటి కలా పారిపోయేదే గాని సాయంత్రం స్కూలు వదిలే టైముకు మళ్ళీ అక్కడే సిద్ధం అయేది! చిన్నపిల్లలంటే అంత ఆకర్షణ.

ఆ రోజు అతను ఆ దారిన రాకపోతే ఏమయ్యేదో చెప్పలేంగాని — అతని రాక ప్రైవితం అయింది.

ఆ పెళ్ళిలో తోటలు బగులు దాపటి కర్రలు పుచ్చుకుని చావ చితకకొట్టారు సరళని.

ఆ దారిన వస్తున్న అతను ఏమిటీ గొడవ అని చూసి కళ్ళపడ్డ దృశ్యం తిలకించి స్తంభించి పోయాడు

మరుక్షణంలో ఆ మనుషుల మధ్యకు ఉరికి సరళకి అడ్డుగా నిలబడ్డాడు. ఒక దెబ్బ అతనిమీద కూడా పడింది.

'ఆగండి ఏం అన్యాయం ఇది? అమాయకురాలి నెందుకిలా చంపేస్తున్నారు?' అని అరిచాడు,

'పిల్లల్ని ఎత్తుకుపోవాలని చూస్తోంది' అన్నాడో పెద్దమనిషి.

'దీని వాలకం ఎన్నాళ్ళనుంచో కనిపెడుతూనే ఉన్నాం, ఈ రోజు దొరికిపోయింది' అన్నాడు ఇంకోకాయన.

'ఇంతకీ ఏంచేసిందని యిలా బాదేస్తున్నారు. చచ్చిపోతే?' కోపంతో ఆవేశంతో అందరినీ నిలదీశాడు అతను.

'ఏంచేసిందంటూ నెమ్మదిగా అడుగుతావేమిటయ్యా? పాపం. పసిది, గుక్క తిప్పుకోకుండా ఏడ్చేసింది. ఆ ఏడుపువిని వచ్చాం కనక సరిపోయింది. లేకుంటే ఎత్తుకు పారిపోయేదే.' అన్నాడో పెద్దమనిషి.

'ఏం సరళా?' అమాయకంగా చూస్తూ నిలబడిన సరళకేసి తిరిగాడు,

సమాధానం చెప్పలేదు సరళ.

'అవునయ్యా పిచ్చిదాన్ని సంజాయిషీ అడుగుతావేం?' అన్నాడొకాయన.

'లేదండి పాప ఆడుకుంటూ కూర్చుంది. మట్టి గుప్పిళ్ళతో తీసి నోట్లో పెట్టుకుంటూంటే ఇది... ఈ పిచ్చిది లేదూ ఆ చెట్టుకిందనుంచి వచ్చి పాప చేతులూ నోరూ తుడిచి ఎత్తుకుంది, పాప ఏడుపు ప్రారంభించింది ఇంతట్లోకీ అమ్మ అరుగుమీదికి వచ్చి చూసి కేకలు వేసింది. అంతే అంతా దాన్ని తరమడానికి వచ్చారు' అని ఓ పన్నెండేండ్ల కుర్రాడు జరిగిన సంగతి విన్నవించాడు.

'అది అరవబట్టి బిడ్డని దించేసింది. లేకుంటే బిడ్డ ఏమైపోయేదో. లేచిన వేళా విశేషం' అంటూ ఆ పిల్ల తండ్రి అన్నాడు.

అందరికీ చేతులు జోడించాడు అతను.

'ఏదో తెలియక చేసింది క్షమించండి. ఇకమీద ఇలా జరగకుండా నే చూస్తాను.

[illegible] ప్రార్థించాడు.

రకరకాలుగా చెప్పుకుంటూ ఒక్కొక్కరే వెళ్ళిపోయారు.

సరళని కూడా నడిపించుకుని ఊరుబైట చెరువుగట్టుమీదకి చేరాడు అతను.

గట్టుమీద చెట్టు నీడన కూర్చున్నారు.

వచ్చేపోయేవాళ్ళ కీదృశ్యం వింతగానే కన బడింది.

రూపురేఖా విలాసాలలో పూర్తిగా పిచ్చిది: అసహ్యంగా ఉన్న ఒక స్త్రీని కూర్చోపెట్టుకుని సంస్కారవంతుడిలా ఉన్న ఒక యువకుడు మాట్లాడుతున్నాడు. వింతగా చూస్తూ చూస్తూ పోతున్నారు.

ఇదేం గమనించడంలేదు అతను.

ఆమెకూడా ఇదేం గమనించడంలేదు.

'చూడు సరళా కోతి ఎంత బాధ పడుతున్నావో' అన్నాడు.

మాసిపోయి చిరిగిపోయి ఉన్న పమిట చెంగు చేతుల్లోకి తీసుకొని కుచ్చెళ్ళు తీస్తూ కూర్చుంది సరళ

'ఈ ఉండటం తాతగారి ఊళ్ళోనే ఓ మూల ఉండకూడదా?' బాధగానే అడిగాడు.

'నా కిక్కడే బాగుంది.'

'పోనీ నే చెప్పినట్టు చేస్తావా? ఊరి చివరగా ఓ పాక ఖాళీగానే పడిఉంది. దాంట్లో ఉంటూ ఉండు. మరి ఇంత అన్యాయంగా తరిమికొట్టరు, ఏమంటావు?'

ఈ మాటలు తాను ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమించిన స్త్రీతో చెప్పడానికి ఎంతో బాధపడ్డాడు అతను. కాని ఏంచెయ్య గలడు?

సరే అని ఒప్పుకుంది సరళ.

తన విన్నపానికి సిగ్గుపడుతూ మళ్ళీ వెళ్ళిపోయాడు.

ఎవరూ ఎదురుచూడని విధంగా కాలం పరిస్థితులని మార్చివేస్తూ ఉంటుంది. ఇది గమనించకుండా ఎవరెవరో బాధ్యులంటూ మనుష్యులు ఒకరినొకరు నిందించుకుం టారు. తాతగారు చేసిన దానధర్మాలని నిర సిస్తూ నిందిస్తూ తగుదుమని మనుమలు రంగంలోకి దిగారు. ప్రతి చిన్న తగాయిదా కోర్టుదాకాతెచ్చి ఆయన ప్రాణానికి విశ్రాంతి లేకుండా చేశారు. అన్నింటికీ తాను తిరగ లేక అతనికి కొన్ని బాధ్యతలు అప్పగించారు తాతగారు. అందుకే అతగాడు రెండుమూడు నెలలు ఊరువిడిచి కదలలేక పోయాడు.

ఆకోవైనా తుపాకీ దాకపోయింది. తాతగారు పశువులని సంతకి తోలించారు. మధ్యాహ్నంగా వెళ్ళి బేరాలెలా ఉన్నాయో చూసి రమ్మని అతణ్ణి ప్రయాణం చేశారు.

మధ్యాహ్నం మూడు గంటలు దాటిపో యింది. ఎండ తీవ్రంగా ఉంది. ఎక్కడ చూసినా ఎర్రదుమ్ము ఎగురుతోంది. తన పాలేళ్ళు ఎటుఉన్నారో చూస్తూ సంత హడావిడిలో అటూ ఇటూ తిరుగుతున్నాడు అతను.

ఎవరో హఠాత్తుగా చెయ్యిపట్టుకు ఆపారు.

అదరిపడి వెనక్కి తిరిగి చూశాడు. సరళ.

అతని ఆశ్చర్యానికి అంతులేదు. సరళ పరిశుభ్రంగా ఉంది. జుట్టు దగ్గరగా ముడివేసుకుంది. చీర పీలికలు వేళ్ళాడుతూ కనబడ్డంలేదు. చేతిలో కొత్త చట్టి. అందులో ఏవేవో ఉన్నాయి. ఒకచేత్తో జాగ్రత్తగా పట్టుకుంది—గాలిపటం!

'సరళా నువ్వా?' అన్నాడు.

'మాట' అని రహస్యంగా పక్కకి పిలి చింది సరళ.

'తనని చూసి తప్పించుకు తిరిగే ఈ పిచ్చి సరళ ఈవేళ ఎందుకిలా పిలుస్తోంది' అనుకున్నాడు.

'ఏం సరళా కులాసిగా ఉన్నావా?'

"ఓ కులాసాగానే ఉన్నాను. వాకోపిల్లాడు దొరికాడు' అంది ఆ మాట అంటున్నప్పుడు సరళ కళ్ళు చేపపిల్లలలాగా మిలమిల మెరి సాయి. కంఠస్వరంలో తృప్తి తొణికిస లాడింది.

'ఎక్కడ దొరకాడు? కొంపదీసి నిజంగా ఎత్తుకురాలేదుకదా?'

'లేదులేదు. నువ్వు చెప్పిన దగ్గరనుంచి అసలా పక్కలకే వెళ్ళడం మానేశాను. వీడు వీడు నన్ను వెతుక్కుంటూ వచ్చాడు' అంది.

సంతలో సందడి తక్కువగా ఉన్నవైపు నడిపించి తీసుకువెళ్ళాడు సరళని. అతనిలో ఏదో భయం ఆవహించింది. నిజంగా సరళ ఎవరినైనా ఎత్తుకొచ్చిందేమో అన్నదే ఆ భయం....

ఓ పక్కగా కూర్చుని 'ఇప్పుడు చెప్పు. నిజంచెప్పు. ఆ రోజులాగా పిల్లల్ని ఎత్తుకు తీసుకువచ్చావు కదూ?' గదమా యించి అడిగాడు.

సరళ కళ్ళ నీళ్ళ తిరిగాయి. కనురెప్పల చివరల ముత్యాల్లాగా రెండు కన్నీటి బొట్లు నేల రాలడానికి సిద్ధంగా ఉన్నాయి.

'చెప్పు సరళా. ఈ బాధలు చాలక కొత్తవి కొనితెచ్చుకుంటున్నావు. చెప్పు ఫరవా లేదు.' బతిమాలాడు.

'నా మాట నమ్ముతావా?'

'నమ్ముతాను చెప్పు.'

'నిజంగా వాడంతటవాడే వచ్చాడు. పదే ళ్ళుంటాయి. చక్కగా దబ్బపండులాగా వుంటాడు. చెంపకు చారెడు కళ్ళు. ఎంత ముచ్చటగా మాట్లాడుతాడో తెలుసా?

'అది సరే వా డెలా వచ్చాడు?'

'ఆ రోజు రాత్రి బాగా చలిగా ఉంది. పాక వెనక చితుకులు పోగువేసి చిన్నమంట చేసి కూర్చుని ఉన్నాను. ఎక్కడో ఎవరో ఏడుస్తున్నట్టు వెక్కివెక్కి పడ్డం విని పించింది. చాలాసేపు విన్నాను. ఎంతకీ ఎటు నుంచి వస్తోందో తెలియలేదు. చివరికి లేచి నాలుగుమూలలా వెతకడం ప్రారంభించాను. ఈ కుర్రవాడు కనిపించాడు. ఓ చెట్టు కింద ఒణికిపోతూ కూర్చున్నాడు పిచ్చితండ్రి. నేను అలా హఠాత్తుగా వెడితే దడుసుకు పారిపోతాడేమో అని భయంవేసింది. కాని అంత వెక్కివెక్కి ఏడుస్తూంటే ఓదార్చ కుండా ఎలా ఊరుకోవడం? దూరంనుంచే 'ఎవరు బాబూ?' అని పలకరించాను. ఓ క్షణంపాటు రెప్ప వాల్చకుండా నా కేసి చూశాడు. తర్వాత ఏమనుకున్నాడో లేచి నా దగ్గరికి వచ్చాడు. పిచ్చినాన్న, నన్ను కౌగిలించుకుని బావురుమన్నాడు. ఎంత భయపడ్డాడో. 'ఏం బాబూ! ఏం కావాలి! ఎవరి అబ్బాయివి?' అని అడిగాను. పాకలోకి తీసుకెళ్ళి కూర్చోపెట్టాను. ఉన్న ఒక్క బొంతా కప్పాను. కుర్రవాడి కళ్ళు నిద్రతో మూరుకుపోతున్నాయి. వెచ్చగా పడుకున్నాడు. పగలు లేచిచూస్తే వాడు ఉండడేమో, ఇదంతా నా కలేమో అని అలా నిద్ర పోకుండా బాబు పక్కనే కూర్చుని రాత్రి గడిపేశాను. ఉన్నాడు. పొద్దుటే లేచి వాడు వెళ్ళిపోలేదు. 'నిన్నేమని పిలవను' అని అడిగాడు నా ఆనందం ఏమని చెప్పను?

'చిన్నమ్మా అని పిలుస్తావా?' అని అడి గాను. వాడు సరే అన్నాడు. నన్ను వదలి పోడు వాడు. నా ప్రాణం వాడు.' అంది సరళ.

'ఎవరి పిల్లాడో? తరువాత ప్రమాదం

కదా?' అడిగాడు అతను. 'ఎవరూ లేరుట. ఇంకెందుకు నేనున్నానుగా వాడికి? రైల్లో టికెట్టు లేదని దింపేశారుట. రైలు కట్ట వెంట నడిచి నడిచి చివరికి ఈ దారిన వచ్చాడుట. ఆ చింతచెట్లు గాలి చప్పుడు అంతా చూసి ఆ చీకట్లో భయం వేసిందిట. అందుకనే ఏడుస్తూ గట్టిగా కళ్ళు మూసుకుని కూర్చుండిపోయాడుట. ఎంత తెలివైన వాడనుకున్నావు? ఇప్పుడు నాకో క్షణం విశ్రాంతి లేదనుకో...నాకు వంకాయ కూరే కావాలి, అంటాడు. తెచ్చిపెట్ట వలసిందే. గోళీలు పలకలు ఒకటేమిటి ఎన్నితెచ్చానో వాడికోసం. ఇదిగో ఈవాళ గాలిపటం కావాలన్నాడు.' అంటూ చేతిలో గాలిపటం చూపెట్టింది.

ఇదంతా అయోమయంగా ఉంది అతనికి.

'కుర్రవాణ్ణి నాకు చూపెడతావా?' అడిగాడు.

'వద్దు రావద్దు ఎవ్వరికీ తనిక్కడ ఉన్నట్టు చెప్పవద్దని ఒట్టు వేయించుకున్నాడు.'

'అలా కాదు. పోనీ నాకు దూరంనుంచే చూపెట్టు. చూసి వెళ్ళిపోతాను' అన్నాడు.

ఎంతోసేపు వాదించాక చివరికి ఒప్పుకుంది సరళ.

పాకదాకా వెళ్ళి దూరంగా నిలబడిపోయాడు.

సరళ పాక తలుపు తోసుకుంటూ 'బాబూ' అని పిలిచింది. పూర్తిగా లోపలికి కూడా రానీకుండా గుమ్మానికి అడ్డంగా నిలబడ్డాడో కుర్రాడు!

'తెచ్చావా? నే నడిగింది.' చేయి చాపుతూ అడిగాడు.

'తెచ్చాను. నన్ను లోపలికి రానీ బాబూ' అంది సరళ వాడి చెంపలు నిమురుతూ.

ఆమె చేతిలోని గాలిపటం లాక్కుని మరీ లోపలికి రానిచ్చాడు కుర్రవాడు.

వెనక్కి చూడనైనా చూడలేదు సరళ.

కొంచెంసేపు అక్కడే నిలబడి వచ్చిన దారిన వెళ్ళిపోయాడు అతను.

ఈ పిల్లవాడు ఎవరు? ఎన్నాళ్ళిలా పిచ్చిదానితో ఉంటాడు? అన్న ఆలోచనలు అతనికి విశ్రాంతి లేకుండా చేశాయి. కాని ఏంచేయాలో నిశ్చయించుకోలేకపోయాడు. కానైతే ఆ రోజునుంచీ పత్రికలలో 'కనబడుటలేదు' అన్న ప్రకటనలకోసం శ్రద్ధగా పరీక్షించడం ప్రారంభించాడు.

(ఇంకా వుంది)

జాన్ న్యూయెల్

# పిచ్చి - అయస్కాంతశక్తి

ఎవరయినా డాక్టరుతో తన మనస్సుని విశ్వకిరణాలు (కాస్మిక్ రేస్) కలవరపరుస్తున్నాయంటే అతను పిచ్చాసుపత్రి కేసు అవుతాడని డాక్టరు అనుకోవచ్చు. ఎవరయినా శాస్త్రజ్ఞుడు వచ్చి పేషంటు అనుమానానికి ఆధారం ఉందని డాక్టరుతో అంటే అతనికి కోపమూ రావచ్చు కాని, ఈ అనుమానానికి ఆధారాలు లేకపోలేదు ఈ ఆధారాలు శాస్త్రజ్ఞులు ప్రత్యక్షంగా కని పరిశోధించినవి

1963 లో 'నేచర్' అనే సుప్రసిద్ధ వైజ్ఞానిక వారపత్రికలో, న్యూయార్కుకి చెందిన 'సిరక్యూస్ విశ్వవిద్యాలయం' ప్రొఫెసర్లు ఇద్దరు, పిచ్చి ఆసుపత్రులలో చేర్పించే పేషంట్ల సంఖ్యలకీ అయస్కాంత వాతావరణా (తుఫాను) లకీ మధ్య కొంత సంబంధం ఉందని నిరూపిస్తూ రాసిన వ్యాసం ఒకటి వేశారు. వీరి వాదాలని ఎందరో ఖండించారు. కాని వారి లెక్కలు మాత్రం సుప్రసిద్ధమయిన ఆసుపత్రులకి సంబంధించినవే.

కొందరు ఇది జ్యోతిశ్శాస్త్ర పునరుద్ధారణకి దారితీస్తుందేమోనని భయపడ్డారు. ఎంత భయపడ్డా పయిన చెప్పిన శాస్త్రజ్ఞులిద్దరూ మరికొన్ని లెక్కలని చూపించటంతో వైజ్ఞానిక వర్గాలవారు వారి వాదాలని జాగ్రత్తగా పరిశీలించవలసివచ్చింది. విశ్వకిరణాల ప్రభావంవల్ల వాతావరణంలో అయస్కాంత కల్లోలాలు ఎక్కువ అవుతాయి. ఈ కల్లోలాలు ఎక్కువ అయినప్పుడు మతి చలనంకూడా అధికం అవుతూ ఉంటుందిట

జంతువులమీద ప్రభావం

అయితే, ఈ పరిశోధనలు ఒక ముఖ్యమయిన విషయాన్ని తెలుపుతున్నాయి. భూగోళంమీది అయస్కాంత వలయంలో ఏ మార్పు వచ్చినా ఏవిధమయిన కల్లోలం ఏర్పడినా—మతిభ్రమణం లేక చలనం అధికం అవదు; విశ్వకిరణాలవల్ల ఏర్పడిన మార్పులు మాత్రమే ఈ పరిణామాలకి దారితీస్తున్నాయి.

జంతువులకికూడా అయస్కాంత క్షేత్రాలలో మార్పులని తెలుసుకునే శక్తి ఉందని కొన్ని పరిశోధనలు తెలుపుతున్నాయి నడుస్తున్న నత్తగుల్లలమీద అయస్కాంత శక్తి ప్రసరింపచేస్తే అవి తమ వెళ్లే దిక్కు మార్చుకుంటాయి! అంతేకాదు, నత్తగుల్లలు భూమిమీద ఉండే అయస్కాంత క్షేత్ర శక్తిని పోలిన శక్తికలిగిన అయస్కాంత క్షేత్రంలోని మార్పులనే బాగా పసిగట్టగలవు అంటే, నత్తగుల్లలలో వల 'దిక్సూచి' వంటి ఏర్పాటు ఉందని ఊహించవచ్చు దీని కంతటికీ కారణం భూగోళం మీద భౌతిక పరిణామం జరుగుతున్నంత కాలమూ ప్రాణులమీద అయస్కాంత శక్తి ప్రభావం ఉండడమే కావచ్చు

[అంతరిక్ష నావికుల ఎముకలలో కాల్షియం లోహం శీఘ్రంగా తగ్గిపోతుంది. ఇదీ పరిశోధించవలసిన విషయమే]

మానవుల మీద పరిశోధనలో శాస్త్రజ్ఞులు వాతావరణంలోని మార్పులకోసం ఆగకుండా ప్రయోగశాలలోనే అయస్కాంత క్షేత్రాలని సృష్టించి వాటిని మార్చటం సాధించారు. ఈ విధంగా పరిశోధనల పరిధిని ఇష్టం వచ్చినట్లు పెంచవచ్చు.

ఇంతవరకూ తెలిసినదేమిటంటే అయస్కాంత క్షేత్రం తీవ్రత ఒకే స్థాయిలో ఉంచితే ప్రాణిలో గమనించతగ్గ మార్పు రాదు. ఈ క్షేత్రం తీవ్రతకీ, మతిభ్రమణానికీ సంబంధం ఉన్నట్లు కనిపించదు. కాని, అయస్కాంత క్షేత్రం స్థాయిని అతి వేగంగా ఎక్కువ - తక్కువచేస్తే మాత్రం ప్రాణి చలిస్తుంది. మానవుల విషయంలో, మెదడులోని విద్యుచ్ఛక్తి తరంగాల తీవ్రతలో మార్పులు గమనించారు పరిశోధకులు.

ఈ పరిశోధనలలో వాడిన అయస్కాంత క్షేత్రాలు ప్రకృతిలో కనిపించే క్షేత్రాల కన్నా తీవ్రతరమయినవి; ప్రకృతిలోని అయస్కాంత క్షేత్ర స్థాయిలోని మార్పులకీ మెదడులోని విద్యుచ్ఛక్తి తరంగాలకీ మధ్య పారిమాణిక సంబంధాన్ని దేనినీ ఈ పరిశోధనలు నిరూపించలేక పోయాయి. కానీ, సంబంధం అనేది ఒకటి ఉందని తేలింది. ముందు ముందు మరింత పరిశోధన జరగాలి.

(ఫో. వ ఫీ.)






ఆ కాళరాత్రి.

ఆకాశం మేఘావృతమై ఉంది... చిక్కని చీకటి...సన్నని జల్లు...ఎక్కడా సరసంచారములేదు...పుంతబాట ప్రక్క తుప్పలలోని పురుగులు కీచుమంటూ రణధ్వనిచేస్తున్నాయి...అప్పుడప్పుడూ మిణుగురు పురుగులు తళుక్కున మెరుస్తూ చీకటి రాక్షసిని మింగడానికి ప్రయత్నించి విఫలమవుతున్నాయి... మసగ్గా కనిపిస్తున్న ఎత్తైన చెట్లు జడలు విరబోసిన బ్రహ్మరాక్షసుల్లా కనిపిస్తున్నాయి ... చెట్లమీద పిట్టలు రెక్కలు ఆడించుకుంటూ ఒక కొమ్మమీద నుండి ఇంకొక కొమ్మమీదకు ఎగురుతున్నాయి.

చకచక నడుస్తున్న రంగరాజా టక్కున ఆగేడు... మొలలో దాచిన చురకత్తిని తడుముకున్నాడు...కళ్లు ఎర్రగా రక్త గోళాల్లా మెరుస్తున్నాయి... నుదుటిమీద చిరుచెమట.

ఛీ! వెధవ నేను ఎవరనుకున్నాడో, నా సంగతి తెలియకే అలా ప్రవర్తించేడు...ఏది ఏమయినా ఈ రోజుతో వాడి నూరేళ్ల ఆయుష్షూ ఆఖరు...ఎంతోమంది సంసార స్త్రీలను పాడుచేసిన వాడిరక్తం ఈరోజున గడ్డకట్టాలి...ఈ రాత్రికి రాత్రే వాడి శరీరం మాయం చెయ్యాలి.

రంగరాజా జేబులోనుండి బీడీ తీసేడు. వెలిగించి గట్టిగా రెండు దమ్ములు లాగేడు. చకచకా నడక ప్రారంభించేడు.

దగ్గరగా సన్నని మంటలు ... పొగ ... ఏదో స్మశానం...కాళ్లకు అడ్డు తగులుతున్న కుండలు...ముళ్ల కంపలు...అడ్డదిడ్డంగా కట్టబడిన గోరీలు...ఏదో కమురు వాసన...ఏవో ఆకారాలు కదులుతున్నాయి... నక్కలు, కప్పిన శవాన్ని బయటకు లాగుతున్నాయి...టపటపమంటూ తలమీదనుండి ఏదో ఎగిరింది...గుండెల్ని పిండే భయం.

జగ్గడు ఆ ఊరికి రావటమే ఏదో శని ప్రవేసించినట్లయింది. వస్తూనే ఊరికి దూరంగా గుడిసెవేసేడు...పదిహేను ఏళ్లు జయిల్లో ఉండి వచ్చేడు...రోజూ ఉదయమూ, సాయంకాలమూ ఊళ్లో షికారు...లోతుగా కళ్లు....కండలు తిరిగిన ఒళ్లు...చింపిరి జుట్టు...గళ్ళలుంగీ.. బనీను... అదీ వాడి ఆకారం...ఆడవాళ్లు బయటకు రావటానికి భయపడేవారు. ఏదో చేసేడని కాదు, చేస్తాడేమోనని నాకు మొదట్లో అదోలా అనిపించినా తరువాత వాడి ప్రవర్తనలో నాకు అనుమానం కలుగలేదు. కొంతకాలానికి మా ఒక్క వీధిగుండానే నడవటం మొదలు పెట్టేడు. నేను బయటకు వెళ్లేటప్పుడు సుశీలను జాగ్రత్తగా తలుపులు వేసుకోమని చెప్పేవాణ్ణి.

సుశీల నా మేనమామ కూతురు. వయస్సు వచ్చేసరికి తల్లీ, తండ్రీపోయి, ఉన్న ఒక్క తోబుట్టువూ పరారికాగా ఏకాకిగా ఉన్న సుశీలను అమ్మ దగ్గరకు తీసుకుంది. చిన్నప్పటినుండీ మేము పెంచుకున్న మమతలు నిజంకాగా, అదృష్టంకొద్దీ సుశీల నా భార్య అయింది. ప్రేమతో పొంగే రోజులు...ఒకరిని ఒకరు వదలలేని దినాలు... ఎడబాటు...విరహం...తృప్తి ... జలజలపారే

కాలం...ఆమె గుండెల్లో మెదలే నారూపం... గలగల్లాడే సంతోషం...ఎన్నో వసంత మధురిమలు.

సుశీల! నా ప్రాణంలో ప్రాణం...

కానీ.. సుశీలా! వాడూ! ...ఛీ...

ఎక్కడో పెద్ద శబ్దమయింది. చీకటి మరింత చిక్కబడింది...ఈదురుగాలి చెట్ల రాపిడికి కీచుమంటుంది...నక్కలు శవాన్ని పీక్కుతింటూ వికృతంగా అరుస్తున్నాయి... ఆ అరుపులకు గుడ్లగూబలు గబ్బిలాలు కూడా బయటకు రావటానికి భయపడుతున్నాయి. ఆ కాళరాత్రికి భయపడిన పక్షుల అరుపులు సమరభూమిలోని క్షతగాత్రుల ఆర్తనాదాల్లా ఉన్నాయి.

రంగరాజు మొలలోని కత్తి బయటకు తీసేడు...పదును చూసేడు...వ్రేలు చురుమంది...నోటికి ఉప్పగా తగిలింది.

మొదటిసారి జగ్గడు తన ఇంటిముందు నిలబడి ఉండటం చూసేడు. గుమ్మములో సుశీల నిలబడి ఏదో అంటూంది...తనను చూసి జగ్గడు సరాసరి వెనక్కు నడిచేడు. మొదటిసారి సుశీల ముఖంలో భయం చూసేడు. దానిగురించి ఏమీ మాట్లాడలేదు రంగరాజు రెండురోజుల తరువాత సుశీలతో అన్నాడు 'జగ్గడు ఈ పరిసరాల్లోనే తిరుగుతున్నాడు, జాగ్రత్తగా ఉండు. బయటకురాకు' అని.

జగ్గడి దినచర్య మారలేదు

రంగరాజు జగ్గడిమీద కన్నువేసి ఉంచేడు.

ఆ రోజు పొలం నుండి వస్తున్నాడు రంగరాజు...ఊరి పెద్దచెరువు గట్టుమీద జగ్గడు నిలబడి ఉన్నాడు.. చెరువులో సుశీల స్నానం చేస్తుంది. జగ్గడు ఏదో చెబుతున్నాడు... నవ్వుతున్నాడు. నీటిలో సుశీల కూడా పకపకా నవ్వుతుంది నీటిలో నుండి బయటకు లేచింది తడిసిన ఒంటికి అతుక్కున్న బట్టలు.. ముఖం మీద పడుతున్న ముంగురులు... చంకలో బిందె...

జగ్గడు సుశీల బుజం తట్టేడు.

రంగరాజు గుండెలు భగభగ మండుతున్నాయి.

సుశీల నాలో ఏమి తక్కువ చూసింది. రెండు తరాలకు సరిపడే ఆస్తి ప్రాణానికి ప్రాణంగా చూసుకునే నేను. తల్లి తండ్రి లేని సుశీలను నా గుండెల్లో పొదివి పెట్టుకున్న నాకు ఇదేనా చేయవలసిన ప్రత్యుపకారం? నాలోని అసమర్థత ఏమిటి? నాలోని ఏ లోపము చూసి నాకు దూరమవుతూ ఉంది?...

భగవాన్ ఎందుకీ శిక్ష నాకు?

ఎవరికీ చెప్పుకోలేని బాధ గుండెల్ని ముక్కలు చేస్తుంది. కళ్లల్లో నీళ్లు గిర్రున తిరుగుతున్నాయి.

ఈ రోజు అనుకోకుండా రాత్రి ఇంటికి తిరిగిరావటముచేత తన ఇంటి మెట్లు దిగుతున్న జగ్గడు కనిపించేడు.

కాళ్లు అక్కడే ఆగిపోయాయి...అరగంట తర్వాత చలనం కలిగిన కాళ్లు నెమ్మదిగా ఇంటివైపుకు కదిలాయి.

సుశీల మంచంమీద నిదురపోతుంది... టేబులుమీద బెడ్‌రూం లైటు వెలుగుతుంది...చెదిరిన కుచ్చెళ్లు... ఒంటిమీద పమిటలేదు...ఆమె శరీరములోని ప్రతీ అవయవమూ ఎత్తిపొడుస్తున్నట్లు బయటకు కన్పిస్తున్నాయి.

జరిగిన సంగతి ఊహించుకున్న రంగరాజు శరీరం కోపంతో ఉడికిపోయింది. రక్తం ఉద్రేకంతో నురగలు క్రక్కింది.. అగ్నిమీద ఆజ్యం పడింది.

ఏదో ఆలోచిస్తూ నడుస్తున్న రంగరాజు గుడ్లగూబల అరుపులకు ఉలిక్కిపడ్డాడు. చుట్టూ కలియజూసేడు ... వానజల్లు హెచ్చింది...మేఘాలు గర్జిస్తున్నాయి. తడిసిన జుత్తును ఒత్తుకున్నాడు.

దూరంగా జగ్గడి గుడిసెలోని దీపం మినుకుమినుకుమంటుంది.

రంగరాజు నడక వేగం హెచ్చింది.

జగ్గడు నులకమంచంమీద నిద్రపోతున్నాడు. పెదాలమీద చిరునవ్వు. .ముఖంలో ఏదో సంతృప్తి.. నేలమీద చింకిచాప. ఒక మూల పాత ట్రంకు...మంచానికి దగ్గరగా హరికేన్‌లాంపు.

రంగరాజు గుండెరాయిలాగ మారిపోయింది మానవత్వం నశించింది...ఒకటే ధ్యేయం, జగ్గడి గుండెల్లోంచి పెల్లుబికే రక్తాన్ని చూడ్డం. కళ్లల్లో ఎరుపుజీర హెచ్చింది... నరాలు ఉబికాయి ... రక్తం నురగలు క్రక్కుతూ పొంగుతుంది.

రంగరాజు జగ్గడి తలదగ్గర నిలబడ్డాడు.

ఎక్కడో పిడుగు పడింది ... వర్షం హెచ్చింది... కుండ పోతగా కురుస్తుంది .. తలుపులు లేని కిటికీలగుండా జల్లు గుడిసె లోపలికి పడుతుంది.

రంగరాజు కుడి పిడికిలి బిగిసింది... చురకత్తి బలంగా గుండెలోకి దిగింది... కసిగా మెలిపెట్టి బయటకు లాగేడు.

కెవ్వున కేక పెట్టేడు జగ్గడు.

'ఛీ! దుర్మార్గుడా, నీ పాపాలు ఈరోజుతో పండేయి. నీలాంటి చీడపురుగులు ఈ లోకంలో ఉండకూడదు. అనుభవించు!'

రంగరాజు కుడిచెయ్యి రెండోసారి పైకి లేచింది.

తెరిచిన జగ్గడి కళ్లు అలాగే చూస్తున్నాయి.

అడ్డుపెట్టిన జగ్గడి చేతిలోని వ్రేళ్లు రెండు ఎగిరిపోయాయి.

'వద్దు బావా వద్దు...నన్ను చంపకు... నన్ను చిత్రవధ చెయ్యకు...నేను ఏ పాపమూ చేసేనని నాకు ఈ శిక్ష విధిస్తున్నావు... నేను ఏ నేరమూ చెయ్యలేదు బావా!...' బొంగురు పోయిన కంఠంతో జగ్గడు అరుస్తున్నాడు.

బయట గాలి ..వర్షపు హోరు...జగ్గడి మాటలు గాలిలో కలిసిపోయాయి.

'ఛీ! వెధవా నేను నీకు బావనా? నీ నోటి గుండా ఆ మాట అంటూ దానికి ఉన్న పవిత్ర అర్థాన్ని మలినం చేయకు. సుశీల సౌందర్యంతో తృప్తి చెందిన నీ కల్మష రక్తం గడ్డకట్టగా నేను చూడాలి. ఏ ఒక్కొక్క పాపానికి ఒక్కొక్క పోటు!

'నేను బావా! జగన్నాథాన్ని, నన్ను గుర్తుపట్టలేదా? సుశీల నా చెల్లెలు. చిన్నప్పుడే ఇంటినుండి పరారి అయి దొంగగా పదిహేను సంవత్సరాలు జైలులో ఉన్నాను. దొంగగా నీకు నా ముఖం చూపించలేక చెల్లాయిని రహస్యంగా కలుసుకుంటున్నాను. తల్లీ, తండ్రీ పోయి, ఉన్న ఈ ఒక్క తోబుట్టువు ముఖంకోసం ఇలా అజ్ఞాతంగా కాలం గడుపుతున్నాను. సుశీలతో నేనే చెప్పేను, నా గురించి ఏమీ నీకు తెలియనివ్వవద్దని'...గిలగిలా తన్నుకుంటున్న జగ్గడు ఊపిరి బిగబట్టి అరుస్తున్నాడు.

రంగరాజు చేతిలోని కత్తి జారి క్రింద పడ్డది.

జగ్గడి గొంతు బొంగురుపోయింది... మాటలు ముద్దగా వస్తున్నాయి...కళ్లు తేలిపోతున్నాయి...వెక్కిళ్లు వస్తున్నాయి.

జగ్గడు గిలగిలా తన్నుకుంటున్నాడు...

గుండెల్లోంచి కారుతున్న రక్తం వేళ్ళమీద అట్ట కడుతుంది.

'బావా! నా ఈ దుర్భరజీవితం ఎన్నాళ్ళ గడపాలో అని అనుక్షణం కుమిలిపోతున్నాను. కానీ నీ చేతుల్లోనే దీనికి అంతం ఉన్న దంటే నేను నిజంగా సంతోషిస్తున్నాను.

# రక్తం కురిసినరాత్రి

కానీ సుశీల నా ప్రాణంతో ప్రాణం.. నా రక్తంతో రక్తం...దానికోసమే ఇన్నేళ్ళూ జైలులో హీనజీవిత మనుభవిస్తూ ఉన్నాను. ...దానికి ఏ కష్టమూ కల్గనీకు బావా!.. ఇంతకన్నా నేను నిన్ను కోరేది లేదు బావా!'

గాలికి పైన తాటేకులు రెండు ఎగిరి పోయాయి. ఆ కన్నాలులోంచి కుండపోతగా వర్షం కురుస్తుంది లోపలికి. అట్టకట్టిన రక్తం కరుగుతుంది.

అంత బాధలోనూ ఏదో జ్ఞాపకానికి వచ్చి ఉలిక్కిపడ్డాడు బగ్గడు.

'బావా! నువ్వు ఇక్కడకు రావటం ఎవరూ చూడలేదుకదా? వెళ్ళిపో బావా వెళ్ళిపో!...నా కోసం...కాదు కాదు.. నా సుశీలకోసం.. కదలవేం బావా?...మృత్యుముఖంలో నున్న నా కోర్కెను మన్నించు... నీ కాళ్ళు పట్టుకుంటాను.'

వేళ్ళు తెగిన చేతితో బనీను జేబులోంచి చిన్నడైరీ, పెన్సిలూ తీసేడు... ఏదో నాలుగు మాటలు బరికి సంతకం పెట్టేడు. క్రిందపడిన కత్తిని కుడిచేతిలోనికి తీసుకున్నాడు.

జగ్గడి పెదాలు ఎండిపోతున్నాయి... నాలికతో తడుపుకుంటున్నాడు... చూపులు ఎక్కడో ఉన్నాయి...అప్పుడప్పుడూ వెక్కిళ్ళు వస్తున్నాయి. బయట పెళపెళ ధ్వనులు... కుండపోతగా వర్షం.. లోకానికే ప్రళయం దాపరించిందా అన్నట్లుంది...లోనికి కురిసిన నీళ్ళు చిన్న వరదలా ప్రవహిస్తూ కరిగిన రక్తాన్ని తనలో కలుపుకుంటున్నాయి.

జగ్గడి ఎక్కిళ్ళు ఆగిపోయాయి... చూపులు నిలిచిపోయాయి.. ఎడమ పిడికిలి బిగుసుకుపోయింది... మొత్రి వేళ్ళసందు నుండి డైరీ రక్తపు ముద్దలాగ కన్పిస్తుంది ...నిలిచిపోయిన చూపులు దీనంగా పారిపో బావా! అంటున్నాయి.

ఆ కాళరాత్రి. ఆ రక్తం కురిసిన రాత్రి. రంగరాజు కాళ్ళు పోలీస్ స్టేషనువైపుకు నడుస్తున్నాయి.




బులుసు వేంకటరమణయ్య

ఆదిలో ఉన్నా లేకపోయినా తర్వాత మన పూర్వీకులు వర్ణాశ్రమ ధర్మాల వ్యవస్థను కల్పించారు. ఈ వ్యవస్థకు కారణం లేకపోలేదు. ఒకరవలంబించే వృత్తి యింకొకరు అవలంబించకుండా ఉండడానికీ, ఏ వృత్తీ విలిచిపోకుండా ఉండడానికీ యిలా వ్యవస్థ ఏర్పడివుండవచ్చు.

బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాలు నాలుగు ఆశ్రమాలు. మొదట్లో బ్రహ్మచర్యాశ్రమ ధర్మాలు అవలంబించి, ఆ ఆశ్రమం అయాక గృహస్థాశ్రమం స్వీకరించవలసి వుంటుంది. సంసార తాపత్రయం ముగిశాక వానప్రస్థాశ్రమం స్వీకరించడమూ, చివరకు సన్యాసం స్వీకరించడమూ పరిపాటి. కొందరి దృష్టిలో సన్న్యాసం మూడో ఆశ్రమమూ వానప్రస్థం నాలుగోదిన్నీ.

ఈ ఆశ్రమాలన్నిట్లో గృహస్థాశ్రమమే చాలా ముఖ్యమైనది. 'బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి జటిపరివ్రాజకావధూ' తాదులను ఆదరించవలసినవారు గృహస్థులే! బ్రహ్మచారి తన బ్రహ్మచర్యవ్రతాన్ని సక్రమంగా జరుపుకోవాలంటే గురు శుశ్రూష చేస్తూ గృహస్థుల యిళ్లల్లో మధుకరం ఎత్తుకోవాలి. గురువు ఏకాకిగావుంటే తాను సంపాదించి తెచ్చిన భిక్షలోనే వంతు పెట్టాలి. గృహస్థుడైన గురువు శిష్యుడికి తన యింట్లోనే భోజనం పెడుతూ విద్య నేర్పడం మన ప్రాచీనుల పద్ధతులలో ఒకటి.

ఆ విధంగానే గృహస్థు కుంటి, గుడ్డి, చెవిటి, మూగ మొదలైన అంగవికలులకూ, సన్న్యాసులకూ కూడా ఆధారం అయి వుంటాడు. ఇలా వుండడమే గృహస్థధర్మం.

ఆ కాలంలో వచ్చే అతిథి అభ్యాగతులను అన్నపానాలిచ్చి ఆదరించే అవకాశం గృహస్థుడికి మాత్రమే వున్నది.

గృహస్థుడు తన సౌఖ్యంకోసమే పాటుపడడం తగదనీ, తన జీవితాన్ని ప్రజోపయోగానికే అంకితం చెయ్యాలనీ మన పెద్దల అభిప్రాయం! స్వప్రయోజనాన్ని విడిచి యితరుల సౌకర్యానికే శాయశక్తులా కాపాడాలి. అందులోనూ భోజనాదుల విషయంలో ఎంతో శ్రద్ధగా గమనించాలి. అతిథి తిండిలేకుండా తన ఇంటికి వచ్చినప్పుడు, అతనికి పెట్టకుండా తాను భుజించిన గృహస్థు అల్పబుద్ధి అనీ, అలా చెయ్యడం తనకేకాకుండా తన వంశానికీ, పశుసంపదకి కూడా మహా హానికరమనీ కఠోపనిషత్తులోని క్రింది వాక్యం చెప్తూ ఉంది —

"ఆశాప్రతీక్షే సంగతగ్ం సూనృతాం
చేష్టాపూర్తే పుత్రపశూగ్ంశ్చ సర్వాన్।
ఏతద్ వృఙ్క్తే పురుషస్యాల్ప మేధసో
యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణోగృహే."

భోజన సమయానికి గురువుగాని, పితరులుగాని స్నేహితులుగాని వచ్చినట్లయితే అభ్యవహార (భోజన) కొండను వారి యిష్ట ప్రకారం జరిపించాలిగాని, తాను స్వాతంత్ర్యం వహించకూడదంటూ, మన పెద్దల శాసనం! ఈ విషయం.

'ఆచార్య పితృసఖీనాంచ నివేద్య వచన క్రియా'

[1–5–24]

అనే గౌతమ సూత్రంవల్ల తెలుస్తూ ఉంది.

మరో ముఖ్యమైన విషయాన్ని గమనించవలసి ఉన్నది.

మన ప్రాచీనులు ధర్మశాస్త్రాలనూ ఆచార వ్యవహారాలనూ వారికి అనుకూలంగా వుండేటట్లు కల్పించుకున్నారనీ, ఇళ్లల్లో పని చేసేవారూ మొదలైన సేవకజనాన్ని చాలా హీనంగా చూసేవారనీ కొందరు అనుకుంటున్నారు. సేవకులు మున్నగువారిని వారు గమనించినట్లు యిప్పుడు మనం చూడ లేదేమో అని నా అభిప్రాయం.

'ఎవరికి ముందు భోజనం పెట్టాలి? ఎప్పుడు తాను భుజించాలి?' అనే విషయాన్ని చర్చిస్తూ గౌతమ ధర్మసూత్రం యిలా చెప్పింది—

'భోజయే త్పూర్వ మతిథికుమార వ్యాధిత గర్భిణీ స్వవాసినీ స్థవిరాన్ జఘన్యాంశ్చ'

[1–5–23]

'మొట్టమొదట అతిథులకూ, పిల్లవాళ్ళకూ, జబ్బుపడి లేచినవారికీ, గర్భవతులకూ, కూతుళ్లకూ, అక్కచెల్లెళ్లకూ, వృద్ధులకూ, జఘన్యులకూ అంటే పరిచారకులు మున్నగువారికీ భోజనం పెట్టి ఆ తర్వాతనే తాను తినాలి' అని దీని అభిప్రాయం!

తక్కిన విషయాలలో ఎలా ప్రవర్తించినా, ముఖ్యమైన భోజనవిషయంలోనయినా పెద్దల మార్గాన్ని అనుసరించడం ఉత్తమ నాగరికతకు లక్షణం!






పశ్చిమదేశపురాజు - అయిదువేల సైన్యంతో తమమీదకు దండయాత్రకు రాబోతున్నాడని మల్లన్నమంత్రికి తెలిసింది. పశ్చిమదేశపురాజు తమ రాజ్యం మీద దండయాత్ర చేసినప్పుడు యెదుర్కోవడంకంటే శత్రుసైన్యాన్ని దారిలోనే యెదుర్కోవడం మంచిదనుకొన్నాడు మల్లన్నమంత్రి. పశ్చిమదేశపురాజు తమమీదకు దండయాత్రకు బయల్దేరాడని తెలియగానే మల్లన్నమంత్రి కూడా ఆరువేల సైన్యంతో బయల్దేరాడు.

కొద్దిరోజులు ప్రయాణంచేసేసరికి పశ్చిమదేశపురాజు పదివేల సైన్యంతో యుద్ధానికి వస్తున్నట్లుగా తెలిసింది. ఈ వర్తమానం తెలియగానే మల్లన్నమంత్రి సైన్యంలో నిరుత్సాహం కలిగింది. రాజధానికి కబురుపంపి అదనపు సైన్యాలను రప్పించడానికి పదిహేనురోజులు పడుతుంది. ఇంక మూడురోజులు ప్రయాణంచేస్తే రెండు సైన్యాలు కలుసుకొంటాయి, అప్పుడు యుద్ధం తప్పదు. మల్లన్నమంత్రి సైన్యం అడవిలో ఒకచోట మకాం చేసింది. మల్లన్నమంత్రి పొద్దున్నే లేచి సైనికాధికారులను రప్పించి వారితో యిలాగ అన్నాడు.

'నాకు రాత్రి ఒక కల వచ్చింది. ఇక్కడకు ఈశాన్యదిశలో ఒక నుయ్యి ఉంది. ఆ నూతిలోనుంచి స్వర్గలోకానికి ద్వారం ఉంది. రేపు సాయంత్రం ఒక సుముహూర్తం ఉంది. ఆ ముహూర్తంలో గనుక ఆ నూతిలో దిగినట్లయితే స్వర్గలోకంలోని నందనవనానికి వెళ్ళవచ్చును. అక్కడ కామధేనువు ఉంది. ఆ కామధేనువు పాలు తీసికొనివచ్చి దానితో పాయసం చేసికొని తాగినట్లయితే వారిని పదిహేను రోజులవరకూ యెవరూ జయించలేరు. అందుచేత నేను రేపు సాయంత్రం ఆ నూతిలో దిగి కామధేనువుపాలు తీసికొని వస్తాను.'

ఈ మాటలు వినగానే సైన్యానికి నూతనోత్సాహం కలిగింది. అక్కడకు ఈశాన్యదిశలో ఉన్న నూతిని వెదికి అక్కడ గుడారాల్ని వేసికొన్నారు మల్లన్నమంత్రి సైనికులు. ఈ వార్త పశ్చిమదేశపు సైన్యానికి తెలియగానే వారిలో నిరుత్సాహం కలిగింది. అయినా, యీ వార్త యెంతవరకు నిజమో తెలిసికొనడానికి పశ్చిమదేశపు రాజు కొంతమంది గూఢచారులను పంపించాడు.

# మీరు బంగారములా చూసుకోతగినవి





## Villiers విల్లియర్

### పంప్-సెట్స్

హెచ్చు నీరు

సమృద్ధిగా పంటలు

ఎక్కువ సుఖమైన జీవితము

- తేలికైనవి మరియు తీసుకపోగలిగేవి...బ్రోలీ మీద అమర్చవచ్చును, పొలములో ఏ చోటులోనైనా ఉపయోగించవచ్చును లేక నూతి నూతికి, కాలవ కాలవకీ తీసుకుపోవచ్చును.
- విడి భాగములు యిప్పుడు విరివిగా లభిస్తున్నాయి. మరామత్తులు అవసరమైతే, విల్లియర్స్ ఇంజనులను దగ్గరలోనున్న డీలరు వద్దకు తేలికగా తీసుకువెళ్లవచ్చును.
- ఇంజను కిరసనాయిలుతో (లేక పెట్రోలుతో) పని చేస్తుంది... కిరసనాయిలు ఎక్కువ చవక మరియు మీ యింటివద్ద లభిస్తుంది.
- 4-స్ట్రోక్ యింజను దిట్టమైనది మరియు చాల కాలము సర్వీసు యిస్తుంది.
- గ్రీవ్స్ వారి విస్తారమైన అమ్మకము తరువాత సర్వీసు ఏర్పాట్లు కలవు.

ఎమ్.కె. 12 హెచ్ ఎస్-పెట్రోల్ / కెరోసిన్: 1·65 హెచ్‌పి
    పంపుల సైజులు: 3·75 సెం.మీ X 3·75 సెం.మీ (1½" X 1½")

ఎమ్/కె. 25 హెచ్ ఎస్-పెట్రోల్ / కిరోసిన్: 3·4 బిహెచ్‌పి
    పంపుల సైజులు: 5 సెం.మీ X 5 సెం మీ (2" X 2"),
    6·25 సెం.మీ X 5 సెం మీ (2½" X 2")

అమ్మకము మరియు సర్వీసు చేయువారు:

## గ్రీవ్స్ కాటన్ & కంపెనీ లిమిటెడ్

19, పెకెంట్ లైన్ బీచ్ పి.బి. నెం. 207 మద్రాసు
'ఇండియా హౌస్' ట్రిచీ రోడ్, కోయంబత్తూరు-18
78/1, జయచామరాజేంద్ర 'రోడ్, బెంగుళూరు-2
సర్కార్ భవన్ పతెమైదాన్, హైదరాబాద్-4




GC/67-29 TEL

## బాలసాహితి

సరిగ్గా మల్లన్నమంత్రి నూతిలో దిగే సమయానికి శత్రుదేశపు గూఢచారులు బాటసారుల వేషాలను ధరించి అక్కడకు వచ్చారు. ఎవరు వచ్చినా, యేమీ అభ్యంతరం చెప్పవద్దని మల్లన్నమంత్రి ఆజ్ఞ యివ్వడంవలన వారిని యెవరూ యేమీ అనలేదు.

సుముహూర్త సమయానికి సైనికులందరూ చూస్తుండగా మల్లన్నమంత్రి ఒకఖాళీ గిన్నెను తీసికొని నూతిలోనికి తాడు ద్వారా దిగేడు. తరువాత కొంతసేపట్లో పాలగిన్నెతో బయటకు వచ్చాడు. పాలగిన్నెను చూసి సైనికులందరూ జయజయధ్వానాలు పలికేరు. తరువాత ఆ కామధేనువు పాలను మామూలు పాలతో కలిపి పాయసాన్ని తయారుచేసి మల్లన్నమంత్రి సైనికులు తాగివేశారు.

ఈ సంఘటనను చూసిన గూఢచారులువెళ్లి పశ్చిమదేశపు రాజుకు జరిగినదంతా తెలియజేశారు. ఈ పరిస్థితిలో మల్లన్నమంత్రిని యెదుర్కోవడం మంచిది కాదనుకొని తిరిగి తమ రాజ్యానికి వెళ్లిపోయాడు పశ్చిమదేశపురాజు.

మల్లన్నమంత్రి తిరిగి తమ రాజ్యానికి వచ్చిన తర్వాత రాజు కామధేనువు పాలను గురించి ప్రశ్నించాడు. 'శత్రు సైన్యాలకు నిరుత్సాహాన్ని మన సైన్యాలకు ఉత్సాహాన్ని కలిగించడానికి నేనే అలాగ చెప్పాను. తరువాత పాలగుండ పాత్రాన్ని రహస్యంగా నూతిలోనికి తీసికొనివెళ్ళి అక్కడ పాలను తయారుచేశా' నన్నాడు మల్లన్నమంత్రి. ●












(గత సంచిక తరువాయి)

మంగేష్ రావ్ ఈ డోలు వాద్యం విని ఉలిక్కిపడ్డాడు. సాయం సమయం త్వర త్వరగా వచ్చేస్తున్నదని, అవి అతనికి గుర్తు చేశాయి. దృఢసంకల్పంతో ఆ అవకాశాన్ని చేజిక్కించుకున్నాడు. బాబాసాహెబ్ కళ్లు తెరవగానే సోఫామీదనుంచి లేచి తలపాగా చుట్టుకొనటం ప్రారంభించాడు. ఆ తర్వాత బాబాసాహెబ్ చేతులుపట్టుకుని క్షమార్పణ కోరేవాడి ధోరణిలో, కాని నిబ్బరంగానే ఇలా అన్నాడు: 'క్షమించండి! ఇలా మీరుచెప్పే కబుర్లని ఎంతసేపయినా సరదాగా వింటూ కూర్చోవచ్చు! కాని, నేను ఇంటికి తిరిగి వెళ్లి పోవాలి నేను తీసుకున్న నెలరోజుల సెలవు రేపటితో అయిపోతుంది! మా ఆఫీసు అధిపతి ఒక ఇంగ్లీషువాడు. చాలా చిత్రమైన మనిషి! క్రమశిక్షణమీద ఎంతో విశ్వాసం కలవాడు—పాంజిమ్‌లో రేపు తెల్లవారే బయలుదేరే స్టీమర్ ఎక్కి ఎల్లుండి బొంబాయి చేరుకోవాలి...

బాబాసాహెబ్ ఈ కోరిక విని అదిరి పడ్డాడు. మాటలేకుండా అతని వయిపే చూస్తూ ఉండిపోయాడు. మంగేష్‌రావు మళ్లీ ఇలా అన్నాడు: 'కాని, మీ ఇల్లు వదిలివెళ్లేముందు మిమ్మల్ని మంరొకసాయం అడగాలనుకుంటున్నాను. ఈ కొండల్లో 'దెయ్యాల అటగది' అనే గుహ ఉందిట గదా! అందులో, ఒక ప్రాచీన శిలాశాసనం ఉందిట? దానిని చూడాలి, ఇవాళే వీకటి పడేలోపలే...నేను చరిత్ర పరిశోధనలు చేస్తూ ఉంటాను...'

'ఏమిటేమిటీ!' అన్నాడు బాబాసాహెబ్. 'ఇదా మీరుకోరేసాయం? మీ ఊరినుంచి ఆ దెయ్యాల సావిడిని చూడటానికింత దూరం వచ్చారే! ఆహా, ఏమి సాయం! మమ్మల్ని సాయంకోరేవారికి అన్నివిధాలా తోడ్పడటం మా కుటుంబ సంప్రదాయం, కాని ఇటువంటి కోరిక ఈ ఇంట్లో వినటం ఇదే మొదటిసారి! భవానీబాబా మనవడికి ఏదయినా సహాయం చెయ్యగలిగితే నాకంటే సంతోషించే వాడెవడు? ఏమి చేద్దామా అంటూ ఉవ్విళ్లూరుతూ మీ కోరిక విందామని ఎదురుచూస్తూ వచ్చాను! భలే ఆశపెట్టారు నన్ను! ఏదో ఆస్తి అమ్మకం, దావా, పెద్ద పోర్చుగీసు అధికారులతో వ్యవహారం, మీ కుటుంబంలో కుర్రవాడికెవరికయినా ఉద్యోగం, కట్నం విషయంలో పేచీ ఏదయినావస్తే పిల్లవాడి తండ్రికి చెయ్యవలసిన సిఫారసు—ఇవేమన్నా అయిఉంటాయనుకున్నాను.. కాని గుట్టు కాస్తా బయట పడింది! చరిత్ర పరిశోధన కోసం కొండమీద గొయ్యిని చూడటానికి వచ్చారు, భేష్!' బాబాసాహెబ్ విరగబడి నవ్వాడు. 'ఏమిటి బాబూ, కొండ గుహల్లోనూ, గోతుల్లోనూకూడా చరిత్ర పరిశోధన చేస్తార్రా, నాకు తెలియకడుగుతాను?'

ఒక క్షణం ఆగి, బాబాసాహెబ్ తన రెండు చేతులకీ మంగేష్‌రావ్ భుజాలమీద ఉంచాడు. 'బాబూ, వినండి! పాండిత్యం అనేది మా దేశ్పాండే రక్తంలో జీర్ణించుకుపోయి ఉంది. కాని, మాలో ఎవరూ ఆ దిక్కు మాలిన దెయ్యాల గదికి వెళ్ళలేదే! అక్కడ సాధారణంగా గొడ్లు కాసేవాళ్ళు వెళ్ళి మధ్యాహ్నం పూట భోజనానికీ, కునుకు తియ్యటానికీ వాడుతూ ఉంటారు. కొండల్లో కుక్కగొడుగులు ఏరినట్లు చరిత్ర విశేషా లని ఏరుకోవచ్చునని మాకు తెలీదా?' అన్నాడు అమాయకస్వరంలో

ఈ విధంగా తన అతిథి పథకాన్ని తోసి పారవేసి, బాబాసాహెబ్ మంగేష్‌రావ్‌ని ఒక్కవారం కాకపోయినా కనీసం నాలుగు రోజులయినా ఉండి ఊరి సంత చూసి వెళ్ళ మన్నాడు; ఇది ఏటా జరిగే పెద్ద విశేషం, చుట్టుపక్కల ఊళ్ళజనం అంతా పోగవు తారు అని నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు.

కాని, మంగేష్‌రావ్‌కి అప్పటికి బాబా సాహెబ్ అనుగ్రహాన్ని ఎదిరించే శక్తి వచ్చింది ఏమయినాసరే కొండగుహ చూడవలసిందే అనుకున్నట్లు బొంబాయికి వెళ్ళవలసిందే అని పట్టుపట్టాడు.

ఇక మంగేష్‌రావ్‌ని మొహమాట పెట్టి లాభంలేదని బాబాసాహెబ్ గ్రహించాడు. ఆ పొడు 'ఇంగ్లీజ్' అధికారిని తనివితీరా తిట్టుకున్నాడు. తర్వాత శానోతో అతిథికి టీ తయారుచేసి అతన్ని కొండగుహకి తీసుకువెళ్ళేందుకు తోడు పిలుచుకురమ్మ న్నాడు. అటునుంచి అటే రహదారికి తీసుకు వెళ్ళే ఏర్పాటు చెయ్యమన్నాడు.

అయితే టీ ఆఖరిది కాబట్టి — అంత త్వరగా ముగియలేదు సూర్యకిరణాలు కొబ్బరి చెట్లమీద వాలుగా పడేదాకా సాగింది చివరికి కొందరు పనివారు కొబ్బరిమట్టల కాగడాలతో హరికేనులాంతర్లతో కర్ర లతో సిద్ధమయ్యేసరికి మంగేష్‌రావ్ తెరిపిగా ఊపిరి పీల్చుకున్నాడు

ఇల్లువదిలి బయటికి రాబోతూ ఉండగా పెద్ద గొడవ ఏదో బయలుదేరింది. సుమారు ఇరవయిమంది, బాబాసాహెబ్ పనిమను ష్యులూ, పూర్‌భయ్యాలూ ఇంటివాకిలివద్ద గుమిగూడారు అందులో కొందరికి బాగా గాయాలు తగిలి రక్తం కారుతోంది. బాధతో మూలుగుతూ, తమ సహచరుల సాయంతో నడుస్తున్నారు. వాళ్ళు దగ్గరే ఉన్న కొబ్బరితోపు వయిపు కోపంగా చూస్తూ పిడికిళ్ళు బిగించి తిట్టుకుంటు న్నారు.

అంతదాకా సౌమ్యంగా ఉన్న బాబా సాహెబ్ మొహం అమాంతం కోపంతో ఎర్రబడింది, బొమలు ముడిపడ్డాయి.

అందరూ లోపలికి వచ్చారు. వెక్కిళ్ళ మధ్య జరిగిన కథనంతా వివరంగా చెప్పారు. విరోధులతో యుద్ధం, రావ్‌సాహెబ్ ముఠా దౌర్జన్యం, వారివద్ద తాము పొందిన పరా జయం

బాబాసాహెబ్ చెప్పినట్లు ఆయన పని మనుష్యులు కొందరు కొబ్బరితోటలో మట్టి తవ్వుతున్నారట పూర్‌భయ్యాలు వారికి కాపలా ఉన్నప్పటికీ అవతల వయిపు పఠానులు కొందరు వచ్చి మట్టి తవ్వ రాదని ఆజ్ఞాపించారు. మాటలు పెరిగి దెబ్బలాటకి దారి తీశాయి. జరిగిన పోట్లా టలో బాబాసాహెబ్ వర్గం ఓడిపోయింది.

ఇది ఎన్నో వరలతో అక్కడ పోగయిన వారు చెప్పిన కథ సారాంశం. చివరికి వారిలో ఒకడు ఒక చిలుముపట్టిన రాగి రేకు ముక్క చూపించి, 'అయ్యగారూ, ఈ రేకుముక్కే మన సాక్ష్యం! దానికెంత నెత్తు రుందో చూడండి! తవ్వుతూంటే ఇది దొరి కింది. గొయ్యి పక్కనే పెట్టి మా పని మేము చేసుకుంటూఉంటే పఠాన్ ఒకడు వచ్చి దాంతో మా తల మీద బాదాడు! మా ప్రాణాలు రక్షించు కునే హక్కు మా కుందిగదా?' అన్నాడు.

మళ్ళీ తన ప్రయాణం వెనుకబడింది కదా అని మంగేష్‌రావ్ విసుక్కున్నాడు బాబాసాహెబ్ పనిమనుష్యులని చూస్తే జాలి కూడా వేసింది కాని, ఇంతలో రాగి రేకు చూడగానే అదేమిటో తెలుసుకుందా మనే కౌతుకం అతనిలో కలిగింది. ముందుకి వచ్చి ఆ రేకు ముక్కని తీసుకున్నాడు.

మంగేష్‌రావ్ కూడా తమ వయిపే ఉన్నాడు కనుకనే ఇంత ఆసక్తి చూపు తున్నాడనుకున్నాడు బాబాసాహెబ్ 'చూశారా వాళ్ళ దౌర్జన్యం!' అన్నాడు. అంతటితో ఊరుకోక వాళ్ళ దౌర్జన్యాల వివరాలు కొన్ని చెప్పాడు 'ఇంకా ఊరుకుంటానా? దీని సంగతేమిటో తేల్చేస్తాను! రేపే ఈ రేకు ముక్కని కోర్టులో దాఖలుచేసి దావా వేస్తాను.'

మంగేష్‌రావ్ అతని మాటలు వింటూ న్నట్లే ఉన్నా నిజానికి ఆ రాగిరేకుని పరీ క్షించటంలో మునిగిపోయాడు. కొంతసేపు తర్వాత దానిని బాబాసాహెబ్‌కి తిరిగి ఇచ్చేశాడు జరిగినదానికి తన సానుభూతి తెలిపాడు. బాబాసాహెబ్ కూడా తన పని మనుష్యులకి ధైర్యం చెప్పాడు. కోర్టుద్వారా ప్రతిపక్షంవారికి తగిన శాస్తి చెయిస్తా నన్నాడు. బాగా దెబ్బలు తగిలినవారిని చికిత్సకని పక్కనే ఉన్న బస్తీకి పంపించాడు.

ఇంటి ఆవరణలో సంచలనం పూర్తిగా తగ్గిపోయింది. అప్పటికే ప్రొద్దుగుంకు తున్నది కాబట్టి, ఇక గుహకివెళ్ళి లాభం లేదనుకున్నాడు మంగేష్‌రావ్. వచ్చినపని కాలేదే అని నిరాశచెందాడు బాబా సాహెబ్ అతనికి కలిగిన ఇబ్బందికి ఎంత గానో నొచ్చుకున్నాడు. సేవకులతో అతిథిని జాగ్రత్తగా రహదారి తీసుకొని పొమ్మనికి చెప్పాడు. మంగేష్‌రావ్ వెళ్ళిపోయేముందు ఒక చిత్రమయిన పనిచేశాడు. తన సంచిలో నుంచి ఒక సిరాసీసా, కాగితం ముక్కా తీశాడు. సిరాని రేకుమీద రాసి కాగితం మీద అచ్చువేశాడు.

'ఇది ఏదో పట్టి రాగి రేకు కాదు బాబా సాహెబ్‌గారూ,' అన్నాడు

'ఇది ఒక ప్రాచీన తామ్రశాసనం! ఈ సంస్కృత శాసనంద్వారా మనకి ఏమేమి కొత్త విషయాలు తెలుస్తాయో! అందుకనే, మీ వ్యవహారం ముగియగానే దాన్ని బొంబా యికి, నాకు పంపించగోరుతున్నాను.'

ఈ కోరిక బాబాసాహెబ్‌కి నవ్వు తెప్పించింది తన ఆందోళన మరిచిపోయి అతిథిని కవుగలించుకుని, మళ్ళీ త్వరలో తన ఆతిథ్యం స్వీకరించాలని మరోకసారి హెచ్చరించి సెలవు తీసుకున్నాడు. పని మనుష్యులతో, 'ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. కంసాలి ఇంటివెనక గట్టు వెంబడే అడ్డదారిని తీసుకువెళ్ళండి ఈయన్ని. 'హాత్‌పాటలాంబా' పొలందాటి పెద్ద రోడ్డు మీదకి వెళ్ళిపొండి,' అని చెప్పాడు.

పొలంలోనికి ప్రవేశించగానే మంగేష్‌రావ్ తనకి తోడుగా వచ్చినవారితో, 'ఇదేనా హాత్ పాటలాంబా పొలం?' అని అడిగాడు.

'అవును బాబూ,' అని వెంటనే జవా బిచ్చాడు లాంతరు పట్టుకుని వస్తున్న ఒక

యువకుడు. బొంబాయినుంచి వచ్చిన ఈ అతిథితో మొదట తనే మాట్లాడే అవకాశం కలిగినందుకు అతనికి గర్వం వేసింది. 'ఇదేనండి, హాత్‌పాటలాయీ పొలం! ఈ చెట్టుకాడనుంచి, ఆ గట్టుదాకా ఈ పొలమే – పొలుకి రెండు పంటలిస్తుంది! జగూసావంత్‌ది కాని రెండేళ్ళగా తాకట్టులో ఉండిపోయింది. అసలు వడ్డీకూడా ఇవ్వలేక పోయాడంట!'

'నోరుముయ్యరా క్షురవేధవా!' అని కోప్పడ్డాడు ఆ జట్టులోకెల్లా వృద్ధుడు, తనకన్నా ముందు ఈ చిన్నవాడు అతిథితో మాట కలిపినందుకు. 'నీకు తెలీని విషయాలు మాట్లాడకబోతే నీ తలేం తీస్తారా? నువ్వు సెప్పిన ఒక్కమాట కర్థం ఉందా? హాత్ పాటలాయీ పొలం ఇంకా రానేలేదు! అక్కడే గదట్రా ఆ బాపనావిడ తన బంగారు 'పత్లీ' (కంకణం) పోగొట్టుకుంది! ఇంకా బుద్ధిలేకుండా ఈ పొలం తాకట్టులో ఉందని కూస్తావా? జగూసావంత్ తన బాకీలన్నీ చెల్లించుకుని షావుకారు దగ్గిర పొలాన్ని విడిపించుకుని ఇప్పటికి ఆరునెలలు కాలేదూ? పోయిన దసరాలోనే గదట్రా?' అతను ఈ ధోరణిలో ఇంకా కోప్పడేవాడేమోగాని మంగేష్‌రావ్ కుతూహలంతో, 'బ్రాహ్మణావిడ ఎవరూ? ఆవిడ పోగొట్టుకున్న కంకణానికీ, ఈ పొలానికీ సంబంధం ఏమిటి?' అని అడిగాడు.

'చెప్తమంటరా బాబూ!' అని ప్రారంభించాడు వృద్ధుడు, సంభాషణ అతిథికి తగిన స్థాయిలో నడుస్తున్నదన్న సంతోషంతో — మంగేష్‌రావ్ వర్గం పండితవర్గం కాబట్టి. 'శానదినాలముందు – ఎంతముందో మనకి తెలీదు!—ఒక బాపనావిడ తన బంగారు గాజుని ఈ పొలంలో పోగొట్టుకుందిట. ఇది శానా పాతకద అని సెప్పాను కదూ! మా తాత ముత్తాతల కాడ్నుంచి వొత్తోంది దయ్యా! ఈ బాపనావిడ గుళ్ళో శాస్త్రుల్లగారి భార్య. పతిరోజూ సీకటితోటే— కోడి కూసేముందే! — లేచివచ్చి పొలంలో గరిక పోసలు కోసుకుపోయేది మొగుడి పూజల కోసం! ఇది అమె కేవాటు బాబయ్యా. కానయితే ఆ దినం దేవుడాజ్ఞే యేమోఆ బాపనావిడ–'

'—పాటలి ఈ పొలంలో నివరేపోయే కాలవలో పడిపోయింది!' అతిథితో మాట్లాడే హక్కు ఒక్క ఆ వృద్ధుడికే ఎందుకు ఉండాలి, అన్నట్టు మరొక సేవకుడు వెంటనే సమాధానం చెప్పాడు. 'పాపం అవిడేం చేస్తుంది? కళ్ళ వొచేట్టు ఏడిచింది...'

ఈ జట్టుతోనే వస్తున్న శానో ఇదంతా సహించలేకపోయాడు. తమ యజమాని ప్రియసేవకుడు తనే కాబట్టి మొహం చిట్లిస్తూ కర్రతో నేలమీద కొట్టాడు. 'ఈ వెర్రి మొహాలకి కథ చెప్పటమే రాదు బాబూ: మా అయ్యగారినోట వినుండాలి మీరు! అవును బాబూ ఆయన బలే చెప్తారు!' ఈ విధంగా తన యజమాని ప్రశంస ముగించి ఇంకా ఇలా చెప్పుకుపోయాడు 'పాపం, ఆ బాపనావిడ అమ్మవారిని ప్రార్థించింది. ఆ రోజుల్లో నమ్మకాలలా ఉండేవి బాబూ! దేవుళ్ళు కూడా మనం ప్రార్థిస్తే పలికేవారు బాబూ! ఆమె మొర విన్న అమ్మవారు ప్రత్యక్షం అయి భక్తురాలిని దగ్గిరికి తీసుకుంది. 'అమ్మాయి ఏడవకు! అదుగో నీ పత్లీ! తీసుకో!' అంది. పాపం ఆ బాపనావిడ నీటి దగ్గిరికి పరిగెత్తికెళ్ళి చూసింది. ఏముందీ, పత్లీ నీటి మీద తేలుతోంది! దాన్ని తీసుకుని అమ్మవారి కాళ్ళమీద పడదామని తిరిగిచూసింది. అమ్మవారు మాయమయిపోయారు!'

గుక్క తిప్పుకోకుండా చెప్పుకుపోయిన శానో ఊపిరి పీల్చుకుందామని ఆగాడు తన యజమానిలాగే కథని చక్కగా ముగించాలని అనుకున్నాడు అదొక పొరపాటయిపోయింది. ఇందాకటి ముసలివాడు వెంటనే కలగచేసుకున్నాడు.

'అవును బాబూ! శానో చెప్పిందినిజమే' అని శానోని పొగడి జాగ్రత్తపడ్డాడు. శానో ఎంత కాదన్నా యజమానికి ప్రియపరిచారకుడు 'జగదంబ పాపం ఆ పూజారి బార్య పత్లీ తిరిగి ఇప్పించింది! అది గొప్ప అద్భుతం! అప్పటినుంచీ ఈ పొలం హాత్‌పాటలాయీ అయిపోయింది. మా ఊరి అమ్మవారికి కూడా కొత్త పేరు పెట్నారు, అని ఎడమవయిపున కనిపించే గుడిని చూపించాడు. ఒకసారి వంగి నమస్కరించి,'అదుగో బాబూ అదే అమ్మవారి గుడి—హాత్‌పాటలాయీ దేవి ఆలయం,' అన్నాడు.

బాబసాహెబ్ పంపిన పనిమనుష్యుల మధ్య ఈ పోటీ మంగేష్‌రావ్‌కి ఎంతో ఉపకరించింది. అసలు కథని క్లుప్తంగా వినగలిగాడు.

'ఇదన్నమాట కథ! బావుంది.' అన్నాడు. నిశ్శబ్దంగా కొన్ని అడుగులు వేశాడు.' అవును! 'హాత్' అంటే చెయ్యి! 'పత్లీ' అంటే చేతి కంకణం! ఆ బ్రాహ్మణ స్త్రీ ఇక్కడ తన 'హాత్‌పత్లీ' పోగొట్టుకుంది! ఈ మాటలకి 'ఆయీ' అంటే తల్లి అనే మాట చేరిస్తే 'హాత్‌పాటలాయి' అవుతుంది! అంతేగా! చక్కటి పేరు, 'హాత్‌పాటలాయీ' అని తనలోతనే అనుకున్నాడు.

అతిథి తమ కథపట్ల చూపిన శ్రద్ధాసక్తులకి తోడువచ్చినవారంతా ఉబ్బిపోయారు. 'అంతే బాబూ! మీరు చెప్పిందంతా నిజం!' అన్నారు. అప్పటికి వారు ఆలయం సమీపించారు. అక్కడ పెద్ద గుంపు పోగయి ఉంది ఆ గుంపులో చాలా మంది సాయుధులయి ఉన్నారు. వారి చేతుల్లో గొడ్డళ్ళు, ఈటెలు, తుపాకులు ఉన్నాయి ఈ అపూర్వదృశ్యం చూసి మంగేష్‌రావ్ చాలా ఆశ్చర్య పోయాడు. త్వరగా తిరిగి వెళ్ళిపోదామనుకుంటున్నప్పటికీ ఒకసారి ఆగి సంగతి ఏమిటో కనుక్కుని వెడదామనుకున్నాడు. అక్కడివారు కొందరు కాగడాలు వెలిగిస్తున్నారు. మరి కొందరు ఏదో విషయం చర్చిస్తున్నారు. మంగేష్‌రావ్ ఎవరిని ఏమి అడుగుదామా అనుకుంటూ ఉండగా అతనికి ఒక సుపరిచితమయిన కంఠస్వరం వినిపించింది. 'అయ్యా, అప్పుడే వెళ్ళిపోతున్నారా? వచ్చిందినమే తిరిగిపోతున్నారా! మా యజమాని ఇంటో ఇటువంటి దెప్పుడూ జరగలేదే!'

పొద్దున మర్రిచెట్టుమీద కనిపించిన వృద్ధుడు మంగేష్‌రావ్ ముందు వచ్చి వినయంగా నిలబడ్డాడు.

'ఏమిటన్నా ఇదంతా?' అని అడిగాడు మంగేష్‌రావ్ చిరునవ్వుతో.

'అంతా కర్మబాబూ, కర్మ! ఇంకేం సెప్పను?' అన్నాడు వృద్ధుడు ముఖం చిట్లిస్తూ. 'మా ఈ కష్టాలకి 'దేవ్‌పాన్!' ఇంతతో మంగేష్‌రావ్‌కి తను చెప్పేది అర్థం కాకపోవచ్చునని గ్రహించి, 'గత అయిదేళ్ళగా ఏవేవో గింజలు తిని బతుకు

నేయబడిన చక్కని డిజైనులలో, లేత రంగులలో లభించే న్యూటెక్స్ తువ్వాళ్లు కంటికి యింపుగా, కొత్త వాటివలె చాలా కాలము మన్నుతాయి

# న్యూటెక్స్ తువ్వాలుతో పెద్దవారు కొన్ని సెకెండ్లలో ఒళ్లు ఒత్తుకోవచ్చును...

## పిల్లలకు ఏమీ టైము పట్టనే పట్టదు!

బొంబే డైయింగ్ వారి విశిష్టమైన న్యూటెక్స్ తువ్వాళ్లను వాడుటకు పిన్నాపెద్దా అందరూ సంతోషపడతారు. దానికి కారణము, మెత్తని మరియు దగ్గరగా నేయబడిన న్యూటెక్స్ తువ్వాళ్లు బొంబే డైయింగ్ వారి 'సూపర్‌లూప్' పద్ధతిలో తయారుచేయబడ్డాయి. కనుక అవి ఒంటిమీద పీటిని త్వరగా, పూర్తిగా ఒత్తుతాయి. పరిక్రొత్త, చక్కని డిజైనులలో లభిస్తున్న యీ తువ్వాళ్లను చూడడమునకు బయలుదేరండి...నేడే కొనండి!

'సూపర్‌లూప్' యొక్క విశేషత ఏమిటి?



న్యూటెక్స్ తువ్వాలు యొక్క పోగులు దగ్గరగా చూడండి. పేంకొండి 'సూపర్‌లూప్స్' ఉండుట వలన యీ మెత్తని తువ్వాలు త్వరగా అరడమే కాకుండా, ఒంటిమీద పీటిని త్వరగా ఒత్తుతుంది కూడా.

న్యూటెక్స్ — 'సూపర్‌లూప్'తో కూడిన విశిష్టమైన బొంబే డైయింగ్ తువ్వాళ్లు

ఉన్నాం బాబూ! ఇప్పుడనికూడా లేవు... మేమూ, మా గొడ్డూ బతుకుతామా, చస్తామా అన్నట్టుంది! ఈ ఏడంటినా మా పెదకామందులు తమ కొట్లాట మానారేమో ననుకున్నాం కాని అంతా పెడిపోయింది. పక్క పల్లెల్లో దున్నటం కూడా పూర్తవుతాంది, ఇక్కడ మాటో? పొలాల నిండా నడుంలోతు ఉప్పునీరాయె! మాకు యేరే గతిలేదు బాబూ — ఊరొదిలి వలస పోవల్సిందే! ఈ పొలాలల్లో మా రగతం, శోడ్సి పనిసేసేము. వీటిని వదిలిపోవాల! మాలో కొందరు పంజాబ్‌లో రోడ్డు కూలీలుగా పోతామంటున్నారు, తక్కినవాళ్లు మార్మగావ్‌లో పోర్టరు కూలి సేస్తామంటున్నరు! మిగతావాళ్లంతా అడుక్కుతినాల్సిందేగద? ఆ బతుకుకంటే సావటం మేలు!'

వృద్ధుడు విచారంతో కుంగిపోయాడు. 'అయితే బాబూ, ఊరొదిలి పొయ్యేముందు మా గ్రామదేవతకి మొక్కుకునిపోతాం. ఈ మొక్కుబడి హాత్‌పాటలంయూ తల్లికే! ఆ తల్లి మా మొర ఇని మేమెక్కడికెళ్ళినా మమ్మల్ని కాపాడుతుంది. ఇంతదాకా శకునా లన్నీ బాగనే ఉండయి. మొన్న మా వాళ్లు వేటకెళ్లి వచ్చారు. ఇంతకి ముందెప్పుడూ అంత దొరకలేదు వాళ్లకి! అంతేకాదండి— రోజులెంబడి అడవుల్లో తిరిగినా అమ్మవారికి ఇచ్చుకునేందుకు ఒక జంతువు కూడా పడేదికాదు! మీకు తెలిసే ఉంటుంది బాబూ—మీ దేశంలోనూ అంతేననుకుంటా —అమ్మవారికి తగిన జంతువు కానుక ఇస్తే ఆ యమ్మ మా మొర ఇనుకుని, గణాచారి మూలకంగా అన సెబుతాది. అవును బాబూ, శకునాలన్నీ బాగనే ఉన్నాయి! మా తాత కాలంలో ఇక్కడ ఏనుగుల మందలు తిరిగే విట బాబూ, ఏనుగుల మందలు! మా తాతే సెప్పాడు. ఇప్పుడవన్నీ లేవు!

కాని వేట కెళిన కుర్రాళ్లు నాలుగు అడివి పందులు, జిల దుప్పులు, ఎన్నో పావుల పిల్లల్నీ తిరిగొచ్చినారు! అబ్బ ఈ మద్దిన ఇటువంటి ఇంత ఇచ్చామా?'

ఇంతలో గుడి దగ్గిర ఎవరో ప్రార్థన మొదలు పెట్టబోతున్నారని అరిచాడు.

'అంతే బాబూ, శకునాలన్నీ బాగా న్నాయి! అమ్మవారు దయ తలిచారని నాకెందుకో అనిపిస్తావుంది! సుఖంగా ఈ గ్రామం వొదిలి పోతాం. ఈ ముసిలివోడి మీద దయుంచండి బాబూ,' అంటూ వెళ్లిపోయాడు వృద్ధుడు.

మంగేష్‌రావ్ మర్యాదగా ఏదో జవాబు చెప్పి చివరిసారిగా గుంపు వయిపు చూసి ప్రయాణం కొనసాగించాడు.

* * *

'దేవ్‌పాన్' అయి రెండువారాలే అయింది. కాని, గ్రామం పూర్తిగా మారిపోయింది. హఠాత్తుగా, దాని పూర్వపు కళ పోయి నిర్జీవంగా కనిపిస్తోంది కట్ట తెగిన అయిదేళ్లలో ఇంత కళావిహీనంగా ఎప్పుడూ లేదు. చిన్న ఇళ్లచుట్టూ వేసే కూరగాయల తోటలు లేవు; మామిడి, పనస చెట్లమీద కాయలులేవు; పశువుల, మేకల, కోళ్ల, కుక్కల ధ్వనులతో హడావుడిగా ఉండే ఊరు సద్దు మణిగిఉంది. సాధారణంగా కనిపించే ఎండుగడ్డి, పేడనుద్దలు, వెదురు బొంగులు, తాటాకు, కొబ్బరి మట్టలు ఏవీలేవు. కుమ్మరిచక్రం తిరగటం మానివేసింది. కమ్మరి కొలిమిలో నిప్పులేదు. మగ్గాలు కదలటం లేదు వీధుల వెంబడి తిరిగే రయితులే లేరు. అసలు, నదివడ్డుమీద, కొండచరియలమీద నరసంచారమే లేదా అనిపించేటట్లు ఉంది. గ్రామం అంతా నిర్మానుష్యంగా కనిపిస్తోంది.

పక్షం రోజుల క్రితం జరిగిన దేవ్‌పాన్ తర్వాత తమ గ్రామదేవత ఆశీర్వాదంతో జట్లు జట్లుగా జనం ఊరువదిలి వెళ్లిపోయారు. ఇంతకి ముందు ఆ ఊరు జనానికి లక్ష్మీకటాక్షం కొద్దోగొప్పో ఉండేది. తిండీ, గుడ్డా విరివిగా దొరక్కపోయినా వళ్లువంచి తమ పొట్ట నింపుకునేవారు. ఈనాడు లక్ష్మీదేవి వారిని చిన్న చూపు చూస్తున్నట్లుంది. చివరి జట్టు కూడా వెళ్లిపోతోంది. ఒక వందమంది తమ గొడ్లనీ, ఇతర చరాస్తినీ పక్క ఊళ్లవారికి అమ్ముకుని మిగిలిన కొద్ది సామానుతో బయలుదేరుతున్నారు. కొన్ని కుండలు, చింకి గుడ్డల మూటలు—ఇక వారికి మిగిలినవి. చిక్కిపోయి, ఎముకల గూళ్లు కనిపిస్తున్న వారి కుక్కలు మాత్రం తమ యజమానుల భావిజీవితాన్ని పంచుకొనటానికి వారి వెంటనే వెళ్లటానికి సిద్ధంగా ఉన్నాయి.

బాబా సాహెబ్‌గారి ఈ రయితులందరూ ఆయన ఇంటి ఆవరణలో నుంచుని కంట తడిపెట్టుకున్నారు.

'బాబూ, మీ దయమూలకంగా ఇన్ని రోజులు మీ నేల సాగుబడి సేసి బతికాం,' అన్నారు. 'కాని, మీ రచ్చన వొదులుకుని పోవాలని మాకు రాసుంది. ఈ బీద రయితుల్ని మరవకండి బాబూ! ఏ నాటికయినా, మంచి రోజులొస్తే, మళ్లీ మీ కాళ్ల దగ్గరే పడుంటాం! ఇంకెక్కడి కెళ్లగలం? మే మెక్కడున్నా మీకూ, మీ పిల్లలకీ మంచి కలగాలనే భగమంతుడికి మొక్కుకుంటూ ఉంటాం...'

వారు ఈ విధంగా సెలవు తీసుకొనటంతో బాబాసాహెబ్ జాలిగుండె తేలికగా కరిగిపోయింది. 'వెళ్లకండి! రావ్ సాహెబ్‌తో రాజీ చేసుకుంటాను!' అందామనిపించింది. కాని, ఏటి అవతల తన చుట్టాల ఇల్లు చూడగానే ప్రతీకారవాంఛ మళ్లీ పెరిగి, ఆ మాటలు నోటి వెనకనే ఆగిపోయాయి. ఏది ఎలా ఉన్నా, ఈ సంఘటన అతనికి ఎంతో విచారం, కలవరపాటు కలిగించింది.

బాబాసాహెబ్ ఇంటి నుంచి రయితులు రావ్ సాహెబ్ ఇంటికి వెళ్లి అతని వద్ద సెలవు పుచ్చుకున్నారు.

వారి దారి చెరువు కట్ట వెంబడే ఉంది. ఈ కట్ట ద్వారానే వారు తరతరాలుగా తమ ఖజన్ని సాగుబడి చేసుకున్నారు. నడుస్తూ ఉన్న వారి అడుగులు బరువెక్కిపోయాయి. కొందరికి కన్నీరు ఆగనేలేదు 'తల్లి వంటి ఈ భూమిని వదిలి వెళ్లిపోతున్నామే' అన్న బాధ అందరిలోనూ మెలగింది. కట్ట చివరికి వచ్చేశారు. ఆఖరిసారిగా తమ ఊరు వయిపు చూశారు. ఇక రహదారి మీదకి వెళ్లే ముందు వారిలో ఒకతను,' సూడు, సూడు! ఆ తపేలా బంగ్రోతు దిక్కుమాలిన కొడుకు నీటిలోకి జారి పడ్డట్టున్నాడు!' అన్నాడు.

ఆ చిన్న పిల్లవాడు నీటిలో నుంచి బయటపడి కట్ట ఎక్కి వస్తూ ఉంటే అందరూ అలాగే చూస్తూ నిలబడిపోయారు. ఆ పిల్లవాడు తన హడావుడిలో ఉత్తరాల సంచీ నీటిలో వదిలివేసి వెళ్లిపోయాడు అక్కడి నుంచి.

'మ్యాడ్మ్, అడికెంత పొగరో! తని

జాగ్రా, అప్పు టపా సంచీ నీటిలో పడిందే, అప్పు అలాగైనే లేదు!' అని అరిచాడు ఒక వృద్ధుడు. 'ఒరే — యస్వీయా, నువ్వు! శీన్వియా! — ఇంకా చూస్తారేంరా? మన బాబాసాహెబ్ గారి ఉత్తరాలేమయినా ఉంటాయేమో! అయిపోయాక మరెవరికి? ఆ కుర్రవెధవ ఇంటికి దివుడు తీశాడు మరి!'

వృద్ధుడు మాట్లాడటం ముగించే ముందే ఒక యువకుడు నీటిలోకి దూకి చేరి వెళ్ళిపోతున్న సంచీని ఈదుకుంటూ వెళ్ళాడు.

గ్రామంలో తపాలాఫీసు లేదు. అది అక్కడికి పదిమైళ్ళ దూరంలో ఉంది. ఇప్పటికి కొన్ని సంవత్సరాలుగా ఉత్తరాలు ఒక ముసలి తపాలా బంట్రోతు తీసుకువస్తున్నాడు. అతను రిటయిరయ్యే కాలంకూడా అతి సమీపంలో ఉంది. అతనికి అసలు పెన్షనులేదు. ఈ ఉద్యోగం దొరకటమే అదృష్టం. అతనికి ఇష్టం వచ్చినరోజున వచ్చిన ఉత్తరాల కట్టని బాబాసాహెబ్ గారి ఇంటి వసారాలోనో, రావ్ సాహెబ్ గారి ఇంటి వసారాలోనో టపాని పడవేసిపోవటమే అతని పని. ఆ ఊరిలో వీరిద్దరికి తప్ప మరెవరికి వస్తాయి లేఖలు? ఒకవేళ వచ్చినా ఆ గ్రామంలో చదవటం అనేది ఎవరికి వచ్చు? ఎలాగూ చదివించటానికి తమ కామందుల దగ్గరకే తీసుకుపోవాలి కదా? అందుకనే, గ్రామస్తులు ఎప్పుడయినా ఒకసారి తమ యజమానుల ఇళ్ళకివెళ్ళి తమకేమయినా ఉత్తరాలు వచ్చాయేమో కనుక్కుంటూ ఉండేవారు. ఈ మధ్య, వృద్ధాప్యంవల్ల పోస్ట్ మాన్ సంచీ కొడుకుచేత తెప్పిస్తూ ఉండేవాడు. వాడికి తొమ్మిదేళ్ళు రానేవచ్చాయి, అప్పటికే గొడ్లు కాయటం కూడా ప్రారంభించాడు.

నీటిలో దూకిన కుర్రవాడు త్వరలోనే సంచీని చేజిక్కించుకున్నాడు. దానిని తుడిచి 'వీరా రెడుతూ ఉండండి! ఈ ఉత్తరాలని బాబుగారి కిచ్చేసొస్తాను' అన్నాడు. పాత సంబంధం తెగిపోయినా బాబాసాహెబ్ పట్ల గౌరవం మాత్రం తగ్గలేదు ఈ యువకుడికి.

బాబాసాహెబ్ వెళ్ళిపోతున్న గుంపునే ఇంకా చూస్తూ నుంచునిఉన్నాడు. వారి వలన తనకి ఎంతో బాధ కలిగింది. అప్పుడప్పుడు పొరంగా ఉన్న వాడవయిపు చూసి నిర్మానుష్యంగా కనిపించే దానిని చూసి మరింత బాధపడేవాడు. 'మా పోట్లాటల వల్ల ఈ పేదరయితుల కింత కష్టం వచ్చింది! పాపం ఇందులో వారి తప్పేముంది? అయిదేళ్ళగా యమయాతన అనుభవించారు. పొట్ట నింపుకొనటానికని ఇప్పుడు తమ ఇళ్ళు వదులుకుని దూరదేశాలు వెళ్ళిపోతున్నారు. వీరి కష్టాలకంతా మేమే కారణం! ఈ పెద్ద ఇళ్ళు, ఆస్తులు వారి శ్రమద్వారానే కదా వచ్చాయి మాకు? పాపం చిన్న కూలికోసం తరతరాలుగా కష్టపడి మా గాదెలు నింపారు! నేడు మేము సుఖపడుతున్నామంటే వారి మూలంగానే! వారి శ్రమే ఈ గ్రామం పంటల కీర్తిని ఇంత చేసింది! అయినా వారు సాగుబడి చేసే భూమిమీద వారికే హక్కులేదు! దేవుడీ అన్యాయాన్ని సహిస్తాడా? వారికి రావలసింది వారికి రాకుండా చెయ్యటం రాక్షసకృత్యం కాదా? ఇది సరి అని వప్పుకుంటాడా?' అనుకున్నాడు. ఇంతలో తపాలా సంచీ తెచ్చిన యువకుడు అతనికి నమస్కారంచేసి, పోస్ట్ మాన్ కొడుకు ఏవిధంగా సంచీ జారవిడచాడో అది తనెలా తీసుకు వచ్చాడో చెప్పి సంచీ ఇచ్చాడు. అతని విశ్వాసం బాబాసాహెబ్ ని బాగా కదిల్చివేసింది. 'మధ్యాహ్న పేజ్ వేళయింది, కాస్త పుచ్చుకునిపో!' అన్నాడు ఆదరంగా.

తర్వాత పోస్ట్ మాన్ కొడుకు సోమరితనాన్ని కాస్త తిట్టి ఉత్తరాలని పరిశీలించటం ప్రారంభించాడు. అందులో ఒకటి బ్రిటిష్ ఇండియానుంచి వచ్చింది. ఆ రోజుల్లో గోవాకి బయటనుంచి ఎక్కువ ఉత్తరాలు వచ్చేవికావు. ముందు దానిని చించుతూ, 'ఓహో, ఇది మన బొంబాయి స్నేహితుడిదగ్గర్నుంచి, అని చిరునవ్వు నవ్వుకున్నాడు. కుతూహలంగా చదవటం ప్రారంభించిన అతని ముఖంమీద చిరునవ్వు క్రమంగా మాయమయి, గాంభీర్యం తొణికిసలాడింది.

మామూలు కుశల ప్రశ్నలు, కృతజ్ఞత తర్వాత మంగేష్‌రావ్ ఇలా రాశాడు.

'మీ పొలంలో దొరికిన తామ్రశాసనం అమూల్యమయినదని తెలుపటానికి సంతోషంగా ఉంది అది కాదంబకులానికి సంబంధించిన శాసనం. ప్రారంభంలో కొన్ని పంక్తులు, మధ్యలోనివీ కొన్ని సరిగా చదవ



# తామ్రశాసనం

టానికి వీలులేకపోయింది కాని శాసనం మొత్తం అర్థం తేలికగా గ్రహించవచ్చు సంస్కృతమూలంతోబాటు అనువాదంకూడా పంపుతున్నాను — చిరిగిపోయిన పంక్తులు మినహాయించి.

'వీరాది పండితవంశం అన్న సంగతి అందరికీ తెలుసు. ఈ శాసనంలోని వస్తువుని నేడు మీ గ్రామంలో హాత్‌పాటలాయీ కథ గురించి చెప్పుకునే కథతో పోల్చి చూడగలరు! కొన్ని దశాబ్దాలముందరే మీ ఊరిచుట్టూ ఏనుగుల మందలు తిరుగుతూ ఉండేవిట అందుచేత బ్రాహ్మణస్త్రీ హాత్‌పత్తీ కథ ఒక చక్కని కట్టుకథ అని గ్రహించవచ్చు! దేవి పేరు 'హాత్‌పత్తీ' నుంచి కాక 'హస్తినీపట్టన్' (ఏనుగుల ఊరు) నుంచి వచ్చిఉంటుంది. నేడు మీ ఊరు ఉన్నచోట ఒక కాదంబరాజు 'హస్తినీపట్నం' కట్టించి ఉంటాడు.

'ఈ తామ్రశాసనం దొరకటం నిజంగా దైవకృపే అంటాను నేను. శతాబ్దాలు భూగర్భంలో దాగిఉన్న ఈ తామ్రశాసనం సరిగ్గా మీ ఖాజన్ గురించిన వివాదం సమయంలో దొరకటం కేవలం దైవేచ్ఛ వల్లనే అనిపిస్తోంది నాకు! ఈ వివాదం వల్ల శ్రద్ధాభక్తులతో ఎంతకాలంగానో ఈ భూమిని సాగుబడిచేసిన మీ రయితులు ఎంత కష్టపడ్డారో నాకు తెలుసు కాబట్టి వేరే ఏదీ రాయనవసరం లేదనుకుంటాను...'

బాబాసాహెబ్ ఆతృతతో శాసనం సంస్కృత పాఠం చదవటం ప్రారంభించాడు.

జాతః శ్రీనరవర్మేతి కర్తైరానందయం జగత్॥ యశ్చాలుక్యం నిజేరాజ్యేఽ స్థాపయ ద్విజితాలుపః॥ కదంబితకదంబోఽలం కృతార్థీ కృతాన్న భుః॥ శౌర్యశ్రీ పరిరంభ విభ్రమభుజోదన్డః ప్రచండోద్యమః చంచచ్చంద్ర మరీచి నిర్మలయశః పుంజైర్జగద్రాజయన్॥ చక్రే గోపక పట్టనే స్థిరపదం.. .. తస్యాద్యపుదగాద్దివోద్దిత రవిర్మాద్యన్మహీపద్మినీమ్॥ ఆశా పూరి కర్తైః సవిజయాదిత్యః సమానందయన్॥ ......... సదనంత వీర విక్రమ కదంబకాదంబ సంపదాం ధామ్నః॥ తదనంత వీరవిక్రమ నరసింహ ఇతివిబుధా కసన్నామ్న:॥ విలోక్య పరితః సర్వాన్। చరతో ద్విపయూథకాన్॥ తత్రైవ స్థాపయామాస। హస్తినీపట్టనం ముదా॥......సతతం సరితః పూరాద్‌బన్ధ భంగవశాత్కృషిః॥ పీడ్యతేదేవతా క్షోభ నిదానోఽయ ముపప్లవః॥ తన్నిరాసాయ్య తత్రయై: సర్వైః కృషి వల్లైర్ ధృవమ్॥ ప్రత్యేక స్మాత్కులాదేవో బలిః కృచ్ఛాత్సమర్ప్యతే॥ తతః సాక్షేత్రియా భూమిః నిరాబాధం స్థిరాభవత్॥ విశత్య తేషాం కృషీ భూమి భక్తిం ముదాయుతో భూమిపతిః కదంబః॥ యావత్సుధాంశు రర్కానుహం మహీందధే భూమిమీందువేదాదిక భూమి తేఽజ్ఞా॥ సామాన్యోఽయం ధర్మసేతు నృపాణాం కాలేకాలే పాలనీయో భవద్భిః॥ సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్। భూయోభూయో యాచతే రామభద్రః స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం॥ షష్టిర్వర్ష సహస్రాణి। విష్ఠాయాం యోజాతే జాయతేకృమిః॥

(ఈ జగత్తుని తన పరాక్రమంతో ఆనందింప చేసిన కాదంబ నరవర్మ పుట్టిన తర్వాత కాదంబ వీరులతో కలిసి శత్రువయిన అలుప రాజుని ఓడించి అతని రాజ్యాన్ని కాదంబ రాజ్యంలో చేర్చుకున్నాడు. ఎవని భుజాలలో శౌర్యశ్రీ అమరి ఉన్నదో, ఏ సూర్యుని చూపుల చేత మహీపద్మిని వికసిస్తుందో, ఎవరి యశస్సు చంద్రుని మరీచి వలె నిర్మలమయి ఈ జగత్తు అంతటా ప్రకాశిస్తున్నదో, ఆ విజయాదిత్యుడు—నరవర్మ కుమారుడు— గోపక పట్నాన్ని వశం చేసుకున్నాడు.

'అనంత వీర విక్రమ సంపద కలవాడు, కాదంబ వంశ సంపద నిధి అయిన ఈ విజయాదిత్యుడు బుధజనం చేత 'వీరవిక్రమ నరసింహా' అనే బిరుదు పొందాడు.

'ఈ ప్రదేశంలో తిరుగుతున్న ద్విప యూథాలని చూసి ఆనందించిన వాడయి హస్తినా పట్నాన్ని ఇక్కడ స్థాపించాడు...

దేవి ఆగ్రహంవల్ల ప్రతి సంవత్సరం ఈ ప్రదేశంలోని పొలం గట్లు నది వరదలకి కొట్టుకుపోయి చాలా నష్టం కలుగుతూ వుండేది దేవిని సంతుష్టపరచటానికి అక్కడి కృషీవలులంతా ప్రతి కుటుంబంలో నుంచీ ఒకరిని బలి ఇచ్చుకునేవారు. అప్పటినుంచి బాధలు తప్పిపోయాయి...

'కదంబ భూపతి నయిన నేను, విజయాదిత్యుడిని, ఈ కృషీవలుల భూమి

భక్తికి మెచ్చి ఈ భూమిని ఇక్కడే ఉంటున్న వీరికే దానం చేస్తున్నాను...

'ఎవరికయినా తను కాని మరొక రాజు కాని దానం చేసిన భూమిని హరించిన రాజు పురుగయి అశుద్ధంలో అరవయి వేల ఏళ్ళు పొర్లుతాడు. ఇది తప్పని విధి. రామభద్రుడు అందుచేతనే అందరు రాజులను భావి రాజులు అనుసరించటానికి విధించిన ఈ విషయాన్ని దాటవద్దని కోరుతున్నాడు...)

శాసనం చదువుకున్న కొద్దీ బాబా సాహెబ్ ఆలోచనలో పడిపోయాడు. ముఖకవళిక గంభీరంగా మారిపోయింది. బొమలు ముడివడ్డాయి. తటాలున కూర్చున్న చోటునుంచి లేచి వసారాలో ఇటూఅటూ పచార్లు చెయ్యటం ప్రారంభించాడు. పరస్పర విరుద్ధంగా ఉండే భావ పరంపరలు అతని తలలో ముసురుకున్నాయి.

కొన్ని నిముషాల తర్వాత శాసనాన్ని తిరిగి చదువుకున్నాడు. మళ్ళీ మూడవసారి చదువుకున్నాడు. ఇంకా మరొకసారి...

పెద్ద నిట్టూర్పు విడిచాడు. అది పశ్చాత్తాపంతో కూడుకుని ఉన్న నిట్టూర్పు

'ఇది రామచంద్రప్రభువు పంపిన అజ్ఞా- సందేహంలేదు, స్వయాన రామచంద్రప్రభువు పంపినదే...' అనుకున్నాడు. 'నేనెంత దౌర్భాగ్యుడిని.' అయిదేళ్ళుగా ఈ దైవాజ్ఞని ఉల్లంఘిస్తూ వచ్చాను, తెలియకుండానే. ఆనాడు ఆ ప్రభువు ఈ శాసనాన్ని వేయించిన తర్వాత ఎందరు చక్రవర్తులు, రాజులు, నాయకులు... మంచివారూ, చెడ్డవారూ!—ఈ మన భరతఖండంలో ఏలారు! ఎన్నో రకాల యుద్ధాలు జరిగాయి, ఎందరో విదేశీయులు మనమీద దండెత్తారు. నెత్తురు నదులుగా పారింది. కాని, ఎవరూకూడా రామచంద్రప్రభువు విధించిన ఈ ఆజ్ఞని ఉల్లంఘించటానికి సాహసించలేదే! ప్రజలకి ఇచ్చిన భూదానాన్ని చెడగొట్టలేదే! అంతపెద్ద చక్రవర్తులు, రాజులు సయితం నేను చేసిన ఈ పాపానికి ఒడిగట్టుకోలేదే!...

'తరతరాలుగా ఈ భూమిని తమ చెమటోడ్చి సాగుబడి చేసుకుంటున్న ఈ బీద రయితులే భూమాత అనుంగు బిడ్డలు.. మహారాజులుకూడా చెయ్యని నేరం నేను—ఒక సామాన్యుడిన్ని ఈ ఖాజన్‌ని కేవలం మూడు తరాలుగా మాత్రమే అనుభవిస్తున్న వాడిని—గుడ్డిగా వెనుకముందులు చూడకుండా చెయ్యటానికి పూనుకున్నానే! ఎంత అన్యాయం! ఎంత అమానుషం! తమ కాయకష్టంతో పండించుకునే ధాన్యంకూడా ఈ నిరుపేద రయితులకి లేకుండా చేస్తున్నానే! ఈ భూమి నిజానికి వారికి ఎన్ని వందల సంవత్సరాల కింద ఆ మహారాజు, ఆ కాదంబ చక్రవర్తి విజయాదిత్యుడు ఇచ్చినదే కదా?

'తల్లీ హోత్ పాటలాయీ—నీకు వెయ్యిసార్లు మొక్కుకుంటున్నాను—నీ పాదాలకి వెయ్యిసార్లు మొక్కుకుంటున్నాను, సరయిన సమయానికి బొంబాయినుంచి ఆ స్నేహితుడిని పంపి నా కళ్ళు తెరిచేట్లు చేసినందుకు! ఒక ఘోరపాపాన్ని సరిపెట్టే అవకాశం ఇచ్చినందుకు! ఇప్పటికయినా నీ హెచ్చరిక వినకపోతే నీ శాపానికి అర్హుడనే అవుతాను ...

'మద్యా!' అని అరిచాడు బాబా సాహెబ్ తన స్వగతం ఆపి, సంచీ తీసుకు వచ్చిన యువకుడితో 'పో! ఊ, వెంటనే!'

మద్యా వసారా మెట్లమీద ఒక మూలగా కూర్చుని ఉన్నాడు. యజమాని పేజ్ ఇప్పించినందుకు ఎంతో సంతోషంగా ఉన్నాడు. అయినే మళ్ళీ ఇంత కోపంగా పొమ్మన్నందుకు నొచ్చుకున్నాడు. ఏమీ పాలుపోక లేచి నుంచున్నాడు.

'పరిగెత్తు! తొందరగా...' అన్నాడు బాబాసాహెబ్. 'ఈ ఎండలో పాపం బరువులతో నడుస్తున్న మీ వాళ్ళనందరినీ ఆపు! అందరినీ పిలుచుకురా ... దేశ్‌పాండే కుటుంబంలో విరోధం ఈ నాటితో అయిపోయిందని చెప్పు! వారంలో కట్టు బాగు చేయిస్తానని చెప్పు! వచ్చే పౌర్ణమి లోపల మా ఖాజన్—కాదు కాదు, వాళ్ళ ఖాజన్—దున్నటానికి సిద్ధంగా ఉంటుందని చెప్పు. పో! తొందరగా అందరినీ తీసుకురా!'



మద్యాకి తల తిరిగి నట్లయింది. కల గంటున్నానా, అనుకుంటూ నోరు తెరిచి తన యజమాని వయిపు చూస్తూ ఉండిపోయాడు.

'పరిగెత్తుకు పొమ్మంటే, ఇంకా ఇక్కడే ఉన్నావేమిటిరా దద్దమ్మా! దేనికోసం ఆగినట్లురా వెధవా!' బాబా సాహెబ్ సహనం పూర్తిగా కోల్పోయి మద్యా మీద అరవటం మొదలుపెట్టాడు.

బాబా సాహెబ్ గొంతుక చిన్నది కాదు. అంతేకాక 'వెధవ' అని అతను తిట్టినప్పుడెల్లా యజమాని తన వాత్సల్యాన్ని ఆ విధంగా చూపిస్తున్నాడని ఊరి వారందరికీ తెలుసు. మద్యా తెప్పరిల్లాడు. ఒక్క ఉదుటున బయటికి దూకి పరిగెత్తి వెళ్ళిపోయాడు, వాయువేగంతో.

'యేషా, నాష్యా, సాఖ్యా, ఆ!—భీవా, శివా...రండి, వెనక్కి రండి — హొరేయ్ మిమ్మల్నేరా! ... హొరేయ్..' సంతోషం పట్టలేక మద్యా తన అనుచరులని పిలవటం ప్రారంభించాడు.

అప్పటికే వారు కొన్ని మైళ్ళదూరంలో ఉన్నారు. కనుచూపులో లేరు. వినే దూరంలోనూ లేరు. వంకర వంకరలుగా తిరిగి వెళుతున్న కట్టమీద బాట వెంబడే పరిగెత్తుకు వెళ్ళిపోయాడు మద్యా.

'ఇనండ్రా, ఇనండి! మన తల్లి తల్లి హోత్‌పత్లాయీ ఈ మహిమ చూపించింది—వారే నమ్మకం లేని పిచ్చివాల్లూ ఇనండి! మన తల్లే మనల్ని తరుముతుందట్రా? పిచ్చి ఎదవల్లారా — అమ్మ పిలుస్తోంది, రండిరా! శివా, భీవా ... ఆగండి...'

చెరువు కట్ట, ఏరు, కొండలు, కోనలు చెట్లు, తీగలు అన్నీ మద్యా సందేశాన్ని ప్రతిధ్వనింప చేశాయి.

'చల్లని తల్లి, మన అమ్మ!.. మనల్ని ఇంటికి రమ్మంటోందిరా! అంతా ఆ యమ్మ మహిమరా...' అనే పాటని గొంతెత్తి పాడాయి.

# జీవనరాగం

ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

ఇద్దరు అన్నయ్యలకి, ఇద్దరు అక్కయ్యలకి ముద్దుల తమ్ముడు నిరంజనం. అందరిలోకి వచ్చగావున్నవాడు అతను. అతనికి భార్య పోవడంతో అత్తగారు సీతమ్మగారిదే యజమాయిషీ. వసంత నిరంజనం కూతురు. ఆమెకి చాల గొప్ప సంబంధం చేయాలని సీతమ్మగారి వాంఛ. అన్నీ సక్రమంగానే జరిగి, వసంత పెళ్లి అయిపోతుంది. నిరంజనం పెద్ద కొడుకు మధు. పట్టభద్రురాలయిన అమ్మాయి సుధతో అతనికి పెళ్లవుతుంది. సీతమ్మగారికి సుధకి అట్టే పడడం లేదు. తనని అత్తవారు బాధ పెట్టేస్తున్నారని సీతమ్మగారి ఫిర్యాదు. సీతమ్మగారికి జ్వరం వొచ్చి పడుకుంటే వసంతా సుధే చేయవలసి వస్తుంది. సీతమ్మగారి జ్వరం ఆమె ప్రాణాన్ని తీసుకుంది. వంటపనికి కాంతమ్మని పెట్టుకుంటారు.

## 8

రెండు నెలలు గడిచాయి. కాంతమ్మ పనిలో వాళ్ల కేలాంటి లోపం కనిపించ లేదు. కాకపోతే కొత్తా పాతా లేకుండా బడ బడ ఏదో వాగుతూనే వుంటుంది.

తల వంచుకుని తన ధోరణిలోనే వుండి భోజనం చేయటం నిరంజనానికి ఎన్నాళ్ళనుండో అలవాటు. అత్తగారు ఉన్నరోజుల్లో కూడ అతిగా మాట్లాడటం వంకలు పెట్టటం అతనికి అలవాటులేదు. బాగుంటే తినటం, లేకపోతే తీసి ప్రక్కన పెట్టేయటం అంతే. అలాంటి నిరంజనాన్ని కూడ,

'పంతులుగారు, ఇవాళ గుత్తి వంకాయ కూర సరిగ్గా కుదిరిందీ కదూ. పచ్చట్లో ఉప్పు సరిపోయిందా,' అంటూ చనువుగా పలకరిస్తూండేది.

అతను ముభావంగా సమాధానం చెప్పి వూరుకునేవాడు.

'అమ్మాయిగారూ' అంటూ సంబోధించి మధుతో కూడ ఏదో మాట్లాడబోయేది.

ఒకటి రెండు రోజులు 'మీరు' అని అన్నా తరువాత 'సుధమ్మా నువ్వు' అనటంలోకి దిగింది. అది గమనించినా, 'ఏదో పని చేసి పెడుతోంది. ఇలాంటి చిన్న విషయాలు పట్టించుకోకూడదు. అయినా నా కన్నా పెద్దదేకదా' అని సరిపెట్టుకుంది. కాకపోయినా,

'ఇదుగో సుధమ్మ నీకా సంసారం చూస్తే నాకెంతో ముచ్చటేస్తుందమ్మో. అబ్బాయిగార్ని చూస్తే నా కొడుకే జ్ఞాపకం వస్తాడు' అంటూ మురిసిపోయే కాంతమ్మతో, నన్ను నువ్వు అనొద్దు అనలేకపోయింది సుధ.

మధ్యాహ్నం కాఫీ తాగి, హాల్లోనే చాప వేసుకుని కూర్చుని టేబిల్ క్లాత్‌కి ఎంబ్రాయిడరీ కుడుతోంది సుధ.

కాస్త ప్రత్తి తెచ్చుకొని విడదీస్తూ కూర్చుంది కాంతమ్మ 'బొత్తిగా వత్తులయిపోయాయి' అంటూ.

'మీ అత్తగారు పోయి కొన్నాళ్లయిందిట కదూ' అంది కాంతమ్మ ఉన్నట్లుండి.

'ఔనట' తల వంచి కుట్టుకుంటూనే సమాధానం చెప్పింది సుధ.

'అయితే మీ మామగారు మళ్లీ పెళ్లెందుకు చేసుకోలేదో.' కళ్లు పెద్దవిచేసుకుని కుతూహలంగా చూసింది.

సుధ చిరాగ్గా మొహం చిట్లించుకుంది. మళ్లీ బాగుండదని కాబోలు తలెత్తి ఆవిడ వంక చూస్తూ, 'ఏమో నాకు తెలియదు' అంది పొడిగా.

'ఔనులే, మీ పెళ్లయి ఏడాదయిందేమో అంతేగా. నీకూ కొత్తే' కాంతమ్మే సమాధానం చెప్పుకుంది. ఓ నిముషం తరువాత కాస్త దగ్గరగా జరిగి గొంతు తగ్గించి,

'అయితే నలుగురూ అనుకునే మాట అను నువ్వు వినలేదూ' అంది ఆసక్తి కలిగించే విధంగా సుధ కళ్లల్లోకి చూస్తూ.

సుధ గుండెలు అవ్యక్తమైన భయంతో దడదడలాడటం మొదలుపెట్టాయి. అంతలోనే, ఈవిడతో చనువుగా వుండటం మంచిదికాదు, నేను యజమానురాల్ని, ఆవిడ వంటమనిషి అనే విషయం అనుక్షణం ఆవిడకి గుర్తుండేలా సమాధానం చెప్పాల్సి అనుకుందికూడ— కాని ఆ భయాన్ని జయించలేనిదానిలా 'ఏమిటది ?' అంది బెదురుగా కాంతమ్మ కళ్ళల్లోకి చూస్తూ.

'నలుగురూ అనుకుంటూంటే విన్నానమ్మో, పాపం పుణ్యం ఆ భగవంతుడికే తెలియాలి' అంటూ రెండు లెంపలూ వేసుకుంది కాంతమ్మ. సుధ అలాగే గుడ్లప్పగించి ఊపిరి బిగపట్టుకుని కూర్చుంది.

'పెళ్లిచేసుకోమని ఎంతమందో బలవంతం చేశారుట. మీ ఆయన మేనత్తలు, సీతమ్మగారు ఎన్నివిధాల నచ్చచెప్పినా ఆ వచ్చే ఆవిడ ఈ పిల్లల్ని సరిగ్గా చూస్తుందన్న మాటేమిటి—వాళ్లకేమాత్రం కష్టం కలిగినా నేను భరించలేను. అందుకే ఆ మాట తలపెట్టదలచుకోలేదు—అని చెప్పేశారుట. అవన్నీ బాగానే వున్నాయనుకో—కాని; ఎక్కడో ఎవరో వుంది అంటారు' పరీక్షగా సుధ కళ్లల్లోకి చూస్తూ అంది.

కాంతమ్మగారు చెప్పబోయేది అలాగే వుండొచ్చును అని సుధకి అనిపించసాగినా, ఆవిడ నోట అదే మాటలు వినేసరికి కొయ్యబారిపోయినట్లే అయింది—ఆవిడ చూపుల తట్టుకునే శక్తిలేనట్లు మెల్లిగా తలవాల్చుకుని 'నేను నమ్మను' అంది ఎలాగో.

'నేను మాత్రం నమ్మానా, పాపిష్టి లోకం చూడు అనేకం అనుకుంటుంది. అయినా అందులో తప్పు మాత్రం ఏముందిలే— ఈ పిల్లలు బాధలు పడిపోతారేమోననే భయంతో మళ్లీ పెళ్లిచేసుకోలేదు అనే మంచి పేరూ దక్కింది, తనకా ఏ లోపం లేకుండా జరిగిపోతోంది.'

సుధకి వళ్లంతా కంపరం ఎత్తుతోంది. మరి వినటం సాధ్యం అనిపించలేదు.

'మూడు దాటింది. వెళ్లి టిఫిన్ చెయ్యండి. మళ్లా ఆలస్యం అయిపోతుంది' అంటూ గబగబ చెప్పేసి కుట్టు సామాను తీసుకుని గదిలోకి వెళ్లిపోయింది.

సుధ మనస్సంతా ఎలాగో అయిపోయింది— కాంతమ్మ చెప్పింది నిజమేనా. నేను వచ్చి ఏడాదయినా ఎప్పుడూ ఎవరి నోటా ఈ మాట వినలేదు. బాగుంది - వారితో సినిమాకో, షికారుకో తప్ప నేనెక్కడికీ వెళ్లనే వెళ్లను! నాకీ వూళ్లో తెలిసినవాళ్లూ ఎవరూ లేరు. ఇక పనిగట్టుకు నివచ్చి నాతో ఎవరు చెప్తారు— ఇంట్లో కూడ ఈ సంగతి తెలిసినట్లే వుండదు— వాళ్లకే తెలియదేమో—ఆ. తెలియకుండా ఎలా వుంటుంది కాని పైకి అనుకోరు— అయినా ఆ పెద్ద మనిషికి ఇదేం బుద్ధి. మహ రాజులా పెళ్లి చేసుకుంటే ఎవలొద్దన్నారు — ఇరుగూ పొరుగూ కూడ అనుకోగా వినలేదు. ఇన్ని ఆలోచన లెందుకు వారినే అడిగేస్తే— ఇలాంటి వివరాలన్నీ నీకెందుకు, నోరు మూసుకు కూర్చో అంటారేమో— లేకపోతే 'నిజమే సుధా, ఆయనలోని ఆ బలహీనతకి నేనెంతో సిగ్గుపడుతున్నాను' అంటారేమో. అయినా అవెమ్మో ఎలా అడగటం— పాపం మామయ్యగారివి చూస్తే అలా అనిపించనే అనిపించదు. తలవంచుకుని తన పనేదో తను చేసుకుపోవటం, అవసరమైన నాలుగు మాటలు వాత్సల్యం తొణికిసలాడుతూండగా ఎంతో నెమ్మదిగా చెప్పటం — మరీ బాగుంది. నాతో మర్యాదగా వుండకపోతే మరెలా వుంటారు. నా అంత కూతురుంది ఆయనకి— ఇంతకీ ఆవిడెవరో ఎక్కడుందో. ఒక్కసారి చూస్తే బాగుండును. అందంగానే వుండివుంటుంది. ఏ కులమో, ఎన్నేళ్లుంటాయో. కొంపదీసి దానిపిల్లలకి కూడ ఆస్తి పంచిపెట్టమనరుకదా— ఛ. దేవుడులాంటి మనిషినిగురించి నేను చాల అన్యాయంగా అసందర్భంగా ఆలోచిస్తున్నాను— ఊళ్లో ఏనాడూ ఎవరి నోటా వినని విషయం కొత్తగా ఈ వూరు వచ్చిన మనిషికి తెలుస్తుందా—' తుదీ మొదలూ లేని ఆలోచనలతో తలంతా వేడెక్కిపోయింది. కాని మనస్సుకి స్థిమితం కుదరలేదు. ఏమిటో తిక్కగా వుంది. ఏదో కారణంగా ఎవరితోనైనా పోట్లాడి నాలుగు కేకలేస్తే బాగుండుననిపిస్తోంది.

రోజూ తను వచ్చేవేళ్టికి చక్కగా ముస్తాబయి రేడియో వింటూనో, జాజి పువ్వులు మాల కట్టుకుంటూనో, కూర్చునే సుధ, తలయినా దువ్వుకోకుండా అస్తవ్యస్తంగా మంచంమీద పడుకుని తలగడ గుండెలమీద పెట్టుకుని తీవ్రాలోచనలో



## 18 CLUES

1. As the history of the world abundantly proves power when it is wielded too long, corrupts even men of discrimination and **Ability / Nobility.**
2. **Beauty / Duty** and love must go together.
3. The developement of **Cultural / Ethical** values and mystery of the physical world are both necessary for the progress of man kind.
4. It is the very nature of the ego to know itself as **Everything / Existing.**
5. A society truly free from **Exploitation / Privation** can be created only through non-violence.
6. Make **Food / Money** available in plenty, make it cheap and you lay the foundation of a sound economy for the country
7. One should never depend on others for one's **Happiness / Success**
8. **Humanity / Morality** has all its force only when it is intimately connected and ultimately rooted in religion
9. In India it is the **Indivisibility / Universality** and impersonality and not the finitude and separation of the self that are posited
10. Self-conquest is the real conquest, abstinence from **Indulgence / Violence** is real strength
11. Indeed the question of war and peace involves a profound **Moral / Spiritual** issue for mankind
12. The common man of India, illiterate, poor, exploited as he is, is still a **Noble / Whole** man.
13. A philosophy which draws inspiration exclusively from the past scriptures cannot free a country from the evils of the **Past / Present**
14. We should not forget that religion is something immensely **Personal / Practical.**
15. Everything in fact that a scientist discovers has a **Philosophical / Spiritual** meaning
16. No sentiment is more spontaneous in its origin than the **Racial / Religious** sentiment, more persistent throughout human history and more far-reaching in its influence
17. Were **Rationality / Spirituality** to guide our destiny wars would have become extinct long ago.
18. The world offers us many pleasant things no doubt. But they never give us **Satiety / Tranquility.**

గమనిక : పై క్లూలు గ్రంథకర్తలు, రచయితల పుస్తకముల నుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు రచయితల పేర్లు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు లిట్ క్విజ్ వీక్లీలో ప్రకటింపబడును.

**తెలుగు అనువాదం వచ్చేవారం పత్రికలో చూడండి.**

# జీవనరాగం

ముడిగిపోయి వుండటం చూసి తెల్లబోతూ, 'అలా వున్నావేం.' అన్నాడు మధు.

ఉలిక్కిపడి ఈలోకంలోకి వచ్చిన సుధ, 'ఇదుగో. మిమ్మల్నో మాట అడుగుతాను దాచకుండా చెప్తారా.' అని అడిగేస్తానో అనుకుంది. ఆ మాటనోటి చివరదాకా వచ్చింది.

'ఏమిటి చెప్పబోయావు—పడుకున్నావేం తలనెప్పిగా వుందా' అంటూ నుదటిమీద ఆదుర్దాగా చెయ్యివేసి చూసి. 'జ్వరంలేదు' అన్నాడు.

'తలనొప్పిలేదు. ఏం తోచక పడుకుంటే నిద్దర పట్టేసింది.' అంటూ ఆ చేతిని తన రెండు చేతులలోకి తీసుకుంది.

'మరయితే లేచిరా—నాకు ఆకలి మండి పోతోంది.' అభిమానంగా నవ్వి చెయ్యి విడి పించుకోబోయాడు.

'ఊహు.' అంటూ ఇంకా గట్టిగా పట్టుకుంది — మధు ఏదో అనబోయాడు. ఇంతలో వరండాలో బూట్ల చప్పుడు విని పించింది.

'అదుగో నాన్నగారు వచ్చేశారు—నేను బట్టలు మార్చుకుని కాళ్లుకడుక్కు రావద్దూ' మామూలుగానే అన్న ఆ మాటలలో తండ్రి పట్ల ఎంతో గౌరవం అభిమానం వున్నాయని పించింది సుధకి.

'తండ్రి అలాంటివారని తెలిసికూడ ఇంతగా గౌరవిస్తున్నారా—ఊహు తెలియదేమో—అది వినగానే నాకే మనస్సు ఎలాగో అయి పోయింది కదా వీరు అసలు తట్టుకోగలరా—ఔనా కాదా అని నాకే అనుమానంగా వున్న దారుణమైన విషయాన్ని తెలియజేసి బాధించటం ఎందుకు— అయినా ఇప్పుడే అంత తొందరేమిటి.' పరధ్యానంగానే లేచి కూర్చుంది సుధ— చివరికి ఆ ఆలోచనకి స్వస్తిచెప్పి బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ లేచి లోపలికి వెళ్లిపోయింది.

* * *

మధుగదిలో టేబిలుముందు కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు. కుర్చీ వెనక నిలబడిన సుధ అతని మెడచుట్టూ రెండు చేతులూ వేసి, భుజంమీద గడ్డం ఆనించి, 'ఊహూ, చెప్పాలి మరి' అంటూ గునుస్తోంది.

మధు ఏదో చెప్పబోయి, గదిలోకి ఎవరో వచ్చిన అలికిడి అయి చటుక్కున తలతిప్పి చూశాడు. సుధకి కూడ అలాగే అని పించింది.

ఎంత అత్యవసరమైన పనివున్నా బయట నుంచి పిలవడమే కాని కొడుకు గది గుమ్మం దాకా కూడా ఎప్పుడూ వెళ్ళడు నిరంజనం. అసలు అలా పిలవటానికే ఎంతో మొహమ్మాటంగా వున్నట్లు, మధు ఏ వరండాలోనో వున్నప్పుడే తను చెప్పాల్సిందేదయినా వుంటే చెప్తుంటాడు.

కర్టెను తొలగించుకుని లోపలికి రాబోయిన వారెవరో ఎంతకీ అర్థంకాలేదు సుధకి. తెల్లబోతూనే గుమ్మం దగ్గరికి వెళ్లింది. గబగబ హాల్లోంచి వెళ్లిపోతున్న కాంతమ్మ కనిపించింది. సుధకి ఎంతయినా అసహ్యం వేసింది. వెనకే వెళ్లి,

'ఏం కావాలి?' అని అడిగింది. ఆ అమ్మాయి ఎంత దాచుకోవాలనుకున్నా గొంతులో త్రుణీకార భావం స్పష్టంగా వ్యక్తం అవుతూనే వుంది.

'అబ్బాయిగారు ఇంట్లో వున్నారనుకో లేదు—ఎక్కడికో వెళ్లటానికి ముస్తాబయి ఇందాకనే హాల్లోకి వచ్చారుకదా, వెళ్లి పోయారేమోననుకున్నాను' సుధ కోపంగా వుందని గ్రహించిన కాంతమ్మ సంజాయిషీ ఇవ్వబోయింది.

'వారు వెళ్తే నేనుమాత్రం వెళ్ళనూ?'

'నువ్వువెళ్తే చెప్పే వెళ్లేదానివిగా— ఏ పనైనా వుండి అబ్బాయిగా రొక్కరూ వెళ్లిపోయారేమో, నువ్వొక్కదానివే గదిలో వున్నావనుకున్నాను'— తన పొరపాటు ఒప్పు కున్నాకకూడ సుధ అలా నిలతియ్యటం ఇష్టంలేనట్లు కాంతమ్మకూడ బెదురు లేకుండానే సమాధానం చెప్పింది.

'ఇంతకీ ఎందుకొచ్చారు?' విసుగ్గా అడిగింది సుధ.

'ఏంలేదు, గుళ్లో పురాణం చెప్తున్నారుట వెళ్దామని— ఈ పాపిష్టిజన్మ, పుట్టినప్పటి నుంచి కష్టాలతోనే గడిచి పోయింది నాలుగు మంచి ముక్కలు చెవినివేసుకుంటే వచ్చే జన్మకయినా కాస్త పుణ్యం దక్కుతుంది—'

'వంటయిందా?' ఆ పని తన నెత్తిన పెట్టి పోతానంటుందేమోనని మధ్యలోనే అడిగింది సుధ.

'నయమే— వంట ఇందాకనే అయిపోయింది. మొహం మరీ బిడ్డు ఓడుతోంది నిన్ను అడిగి కాస్త పౌడరు చెంపలో వేయించుకుందా మని—'

# ప్రతి పోటీలో ఒక కొత్త రకం

LitQuiZ NO. 26

Rs. 30,000

FIRST PRIZE Rs. 15,000

RUNNERS-UP UPTO 4 ERRORS Rs 9,000

MINIQUIZ UPTO 2 ERRORS Rs 5,000

FAMINE RELIEF FUND : Rs. 1,000

ఆఖరు ముగింపు తేది: 28—12—67.
సొల్యూషన్ భారత్ జ్యోతిలో: 31-12-67.
ఫలితాలు భారత్ జ్యోతిలో: 14-1-68.
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 6 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను. *లిట్‌క్విజ్ పిక్లి 10పంపికలకు రు 2 పంపవలెను. * విగా ఎంట్రీలను 27-12-67 బుధవారమునాడు కూడా పంపవచ్చును. కాని వాటిని ఎక్స్‌ప్రెస్ డెలివరీలో పంపవలెను.

## లిట్‌క్విజ్ నెం. 26 అధికార ఎంట్రీ ఫారము

**ADDRESS: LITQUIZ No. 26, ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)**

గమనిక : (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్‌మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P. O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 26, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| | 1 Re. 1 | | 2 Re. 1 | | 3 Re. 1 | | 4 Re. 1 | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ABILITY | NOBILITY | ABILITY | NOBILITY | ABILITY | NOBILITY | ABILITY | NOBILITY |
| 2 | BEAUTY | DUTY | BEAUTY | DUTY | BEAUTY | DUTY | BEAUTY | DUTY |
| 3 | CULTURAL | ETHICAL | CULTURAL | ETHICAL | CULTURAL | ETHICAL | CULTURAL | ETHICAL |
| 4 | EVERYTHING | EXISTING | EVERYTHING | EXISTING | EVERYTHING | EXISTING | EVERYTHING | EXISTING |
| 5 | EXPLOITATION | PRIVATION | EXPLOITATION | PRIVATION | EXPLOITATION | PRIVATION | EXPLOITATION | PRIVATION |
| 6 | FOOD | MONEY | FOOD | MONEY | FOOD | MONEY | FOOD | MONEY |
| 7 | HAPPINESS | SUCCESS | HAPPINESS | SUCCESS | HAPPINESS | SUCCESS | HAPPINESS | SUCCESS |
| 8 | HUMANITY | MORALITY | HUMANITY | MORALITY | HUMANITY | MORALITY | HUMANITY | MORALITY |
| 9 | INDIVISIBILITY | UNIVERSALITY | INDIVISIBILITY | UNIVERSALITY | INDIVISIBILITY | UNIVERSALITY | INDIVISIBILITY | UNIVERSALITY |
| 10 | INDULGENCE | VIOLENCE | INDULGENCE | VIOLENCE | INDULGENCE | VIOLENCE | INDULGENCE | VIOLENCE |
| 11 | MORAL | SPIRITUAL | MORAL | SPIRITUAL | MORAL | SPIRITUAL | MORAL | SPIRITUAL |
| 12 | NOBLE | WHOLE | NOBLE | WHOLE | NOBLE | WHOLE | NOBLE | WHOLE |
| 13 | PAST | PRESENT | PAST | PRESENT | PAST | PRESENT | PAST | PRESENT |
| 14 | PERSONAL | PRACTICAL | PERSONAL | PRACTICAL | PERSONAL | PRACTICAL | PERSONAL | PRACTICAL |
| 15 | PHILOSOPHICAL | SPIRITUAL | PHILOSOPHICAL | SPIRITUAL | PHILOSOPHICAL | SPIRITUAL | PHILOSOPHICAL | SPIRITUAL |
| 16 | RACIAL | RELIGIOUS | RACIAL | RELIGIOUS | RACIAL | RELIGIOUS | RACIAL | RELIGIOUS |
| 17 | RATIONALITY | SPIRITUALITY | RATIONALITY | SPIRITUALITY | RATIONALITY | SPIRITUALITY | RATIONALITY | SPIRITUALITY |
| 18 | SATIETY | TRANQUILLITY | SATIETY | TRANQUILLITY | SATIETY | TRANQUILLITY | SATIETY | TRANQUILLITY |

SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE — NO. 26 — SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE

MiniQuiz

12 CLUES FREE COUPON 1

| | | | |
|---|---|---|---|
| ABILITY | NOBILITY | INDULGENCE | VIOLENCE |
| BEAUTY | DUTY | MORAL | SPIRITUAL |
| CULTURAL | ETHICAL | NOBLE | WHOLE |
| FOOD | MONEY | PAST | PRESENT |
| HAPPINESS | SUCCESS | PERSONAL | PRACTICAL |
| HUMANITY | MORALITY | RACIAL | RELIGIOUS |

MiniQuiz

12 CLUES FREE COUPON 2

| | | | |
|---|---|---|---|
| ABILITY | NOBILITY | INDULGENCE | VIOLENCE |
| BEAUTY | DUTY | MORAL | SPIRITUAL |
| CULTURAL | ETHICAL | NOBLE | WHOLE |
| FOOD | MONEY | PAST | PRESENT |
| HAPPINESS | SUCCESS | PERSONAL | PRACTICAL |
| HUMANITY | MORALITY | RACIAL | RELIGIOUS |

26 (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/-. ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/-. M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.............

CAPITAL LETTERS

NAME ..........................................................

ADDRESS ......................................................

..................................................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

కాంతమ్మ కోరిక వింటూ తెల్లబోయిన సుధ పైకి ఏమీ అనలేక మొహం చిట్లించుకుని గదిలోకి వెళ్లి డబ్బాతెచ్చి ఆవిడ చేతిలో కాస్త పౌడరు వేసింది.

## జీవనరాగం

'ఏం మనిషో. పుణ్యం కోసం పురాణం వినటానికి వెళ్తున్నానంటూ, ఈ పౌడరు లేకపోతే నేనేవో.' అలమారులో డబ్బా పెడూ కాస్త గట్టిగానే విసుక్కుంది.

అంతలో మరో కొత్త వూహావచ్చి సుధ మొహం కోపంతో ఎర్రబడింది.

'నిజంగా పౌడరుకోసమా, లేకపోతే ఎవరూ లేనప్పుడు గదిలో నాలుగూ సవరిద్దామనా.' అనే తన అనుమానం పైకి చెప్పే లోపునే,

'ఆడవాళ్లు అలంకరణకు ఎంత ప్రాముఖ్యా ఇస్తారో నువ్వు గ్రహించుకోడానికి మరో చిన్న ఉదాహరణ.' తల వంచుకుని వ్రాసుకుంటూనే నవ్వుతూ అన్నాడు మధు.

అసలే చిరాగ్గా వున్న సుధ అను బాప్ప దలచుకున్నది మానేసి, 'ఉదాహరణలన్నీ మీ చెల్లాయికి చూపించండి నాక్కాదు.' అంది.

సుధ అన్నదాంట్లో పొరపాటు ఏం లేదు. అప్పటికప్పుడు అనుకుని ప్రయాణం అయినా అరనిముషంలో రెడీ అయిపోతుంది సుధ. అరగంటయినా ఇంకా జుట్టు చిక్కు తీసుకుంటూ అద్దం ముందే వుంటుంది వసంత.

'చీర సింగారించేసరికి...' అన్న సామెత నీలాంటివాళ్లనిబట్టే వచ్చింది' అని మధు ఓసారి హాస్యం చేస్తే,

'మీ ఆవిడ అందగత్తె కనక ఎలా వచ్చినా బాగనే వుంటుంది. నాలాంటిదయినా కాస్త కష్టపడి ముస్తాబు కాకపోతే ఎలా—అయినా మునుపు లేదు. వదిన వచ్చాకనే నీకీ ఆరాలన్నీ తెలుస్తున్నాయి—తను తయారయిపోయి కూర్చుందని, నన్నూ హడావిడి పెట్టేస్తున్నావు—ఆలశ్యం అయిపోతుందని భయంగావుంటే మీ రిద్దరూ వెళ్లండి నేనురాను.' అంటూ అర్థంలేకుండా పేచీ పెట్టి అలిగి కూర్చుని అవాళ్టి ప్రోగ్రాం అంతా పాడుచేసింది. అదంతా జ్ఞాపకం వచ్చిన మధు హాస్యంగా ఇంకేదో అనబోయి సుధ మొహం చూసి వూరుకున్నాడు. కాంతమ్మ మూలంగా వచ్చిన వాదనని పెంచుకుని ఆ సాయంకాలాన్ని వ్యర్థం చేసుకోటం అతనికి నచ్చలేదు. అందుకే,

'నిజమే, ఈసారి వసు వచ్చినప్పుడు జ్ఞాపకం చెయ్యి—ఇంక పద అయిపోయింది.' అంటూ, వ్రాసిన కాగితాలు మడిచి పాడ్ క్రింద పెట్టి లేచాడు.

(ఇంకా ఉంది)

# ట్రంకు పెట్టెలో అందమైన అమ్మాయి శవం

అక్టోబరు 25వ తేదీన కొచ్చిన్ హార్బర్ టెర్మినస్ స్టేషనులో ఆగిన ఐలండ్ ఎక్స్‌ప్రెస్ రైలులో ఒక ట్రంకుపెట్టె దొరికింది. పగలకొట్టి చూడగా అందులో ఒక అందమైన అమ్మాయి శవం వుంది. ఆమెను ఎవరో విషప్రయోగం చేసి చంపి వుండాలని, ఆమె చనిపోయి (అప్పటికి) కొన్నిగంటల కన్నా అవదనీ పరీక్షవల్ల తేలింది. ఆమె ఫోటో వేస్తూ యీ విషయం 'దినతంతి' అనే తమిళ దినపత్రిక రాసింది. అప్పటికి శవాన్ని ఎవరూ పోల్చలేదు. ఆ పత్రిక చూసినవారిలో ఆమె తండ్రి ఒకరు. ఆయన మద్రాసు కిల్‌పాక్ ప్రాంతంలో వుంటున్నారట. ఫోటో చూసి, అదిరిపడి, "మనఅమ్మాయిలా వుందేమిటి" అని అనుమానపడి, కూతుర్ని చూడడానికి బెంగుళూరు వెళ్లారట. కూతురు వూళ్లో లేదట. "భార్యాభర్తలిద్దరూ ఏదో వూరు వెళ్లారు" అని పక్కింటివాళ్లు చెప్పారట. ఆయన మద్రాసు తిరిగివచ్చి, పోలీసులకు రిపోర్టు యిచ్చారు. మద్రాస్ పోలీసులు దర్యాప్తు ప్రారంభించి, ఆమె భర్త గణేశ్‌ను పట్టుకున్నారు.

రెండేళ్ల క్రితం గణేశ్ ఆమెను ప్రేమించి పెళ్లి చేసుకున్నాడట. ప్రస్తుతం బెంగుళూరులో స్టేట్‌బ్యాంకులో వుద్యోగం చేస్తున్నాడట.

గణేశ్ తన భార్య వసంతను బెంగుళూరులో ఒక పెద్ద హోటలుకు తీసుకువెళ్లి, అక్కడ ఆమెను విషం పెట్టి, చంపి, ఒక ట్రంకుపెట్టెలో పెట్టి ఐలండ్ ఎక్స్‌ప్రెస్‌లో ఆ పెట్టెను వదలినట్టు దర్యాప్తుల వల్ల తేలింది. చంపడానికి గల కారణం అధికారపూర్వకంగా తెలీకపోయినా, "భార్య మీద అనుమానం" కొద్దీ యీపని చేసి వుంటాడని అన్నారు.

అతన్ని మొన్న 29వ తేదీని (నవంబరు) మద్రాస్ కోర్టులోనూ, డిశంబరు నాలుగున బెంగుళూరు కోర్టులోనూ విచారించారు. కేసు యింకా నడుస్తోంది.

కోపం తనని తాను సమాధానపరచుకునే స్థితి దాటిపోతే ఆ మనిషిలో కేవలం రాక్షసత్వం వస్తుంది, అసలు రాక్షసుడంటే ఆలోచన లేని తీవ్రకోపం, ప్రతీకార వాంఛకలవాడనే కదా అర్థం! మనిషికి ఆ స్థితి వస్తే ప్రపంచమే నాశనమవుతుంది.

తన పనికి యిప్పుడు ఆ గణేశ్ పశ్చాత్తాప పడితే మాత్రం పోయిన వసంత తిరిగి వస్తుందా! ఆమె తలిదండ్రుల గర్భశోకానికి కించిత్తయినా వుపశమనం అనేది వస్తుందా!!

కోపం లేని మనిషి దేవుడవుతాడు.

అదెలా సాధ్యం!?



## నేరానికంత శిక్ష!

మార్కాపురంలో నవంబరు 27వ తేదీన రాత్రి ఒక రిటైర్డు అధ్యాపకుని యింటిలో ఒక యువకుడు దొంగతనం చేసి, పోతూ—గోడ దూకడానికి ప్రయత్నించడంలో కరెంటుషాకు తగిలి మరణించాడట. గోడదూకడానికి ఒకరాగి డేగిసా బోర్లించి దానిమీద ఎక్కాడట. ఆపాత్రకి కరెంటు వైరు తగిలి వుండడంవల్ల యీ విషాదం సంభవించిందట— పాపం, దొంగతనానికి వచ్చేముందలా అవుతుందనుకునుంటాడా!

మండపేటవాసి అయిన వీర్రాజు అనే ఆయన తన పొలంలో పనిచేసే 16 సంవత్సరాల బాలికను బలాత్కారంగా ఒకపాకలోకి లాక్కొనిపోయి, మానభంగం చేశాడట. దాంతో ఆమెకు వూపిరి ఆడక, అక్కడే చనిపోయిందట— రాజమండ్రి కోర్టులో దోషికి ఏడేళ్లు శిక్ష నిర్ణయించారు— అంతేనా!

## అమెరికాకి మోజేమా?

అమెరికాలో హిందూమత ప్రచారం చాలా విపరీతంగా వుందని వాషింగ్టన్ న్యూయార్క్ పత్రిక వ్రాసింది. న్యూయార్క్‌లో యిటువంటి కేంద్రాలు యిరవైకి పైగా వున్నాయనీ, యునైటెడ్ స్టేట్స్‌లోనూ, కెనడాలోనూ కలిసి రెండు వందలకు పైగా వున్నాయనీ యీ పత్రిక రాసింది. అమెరికన్లు డాక్టర్లు, యాక్టర్లూ, టీచర్లూ, ప్రొఫెసర్లు అందరూ యీ మత విషయం తెలుసుకోడంలో అభిలాష చూపిస్తున్నారట. మియా ఫలో, సినాత్రా, షెర్లీ మెక్లిన్ వంటి విఖ్యాత నటీనటులు **"ఇండియాలోనే మేం స్థిరపడి 'మహర్షి మహేష్ యోగి' వద్ద మోక్ష మార్గం నేర్చుకోవాలనివుంది."** అన్నారట.

## బెదిరింపులు

యమున, చంబల్‌లోయ భీతినివారణ సమితి అధ్యక్షుడు శ్రీకామేశ్వరశర్మ ఒకపత్రికా గోష్ఠిలో మాట్లాడుతూ, "పోయిన మూడు నెలల సంయుక్తదళ పరిపాలన కాలంలో నలభై రెండుమంది పల్లెటూరువారు హత్యగావింపబడ్డారనీ, వో డజను బందిపోటు దొంగతనాలు జరిగాయని, సుమారు రెండు వందలమందిని డబ్బుకోసం ఎత్తుకు పోవడాలు జరిగాయనీ, ఇవి భిండ్, మొరీనా జిల్లాలలో జరిగాయని తెలియజేశారు. రాష్ట్రప్రభుత్వ పోలీసు శాఖలో పెద్ద వుద్యోగస్థులు యీ బందిపోటులతో లాలూచీ పడి, జనసంఘం వారిని యీవిధంగా భయపెట్టేలా చేయించుతున్నట్టు ఆరోపించారు ఆయన.

*  *  *

కలకత్తాకి 5 మైళ్ళ దూరంలో వున్న 'డండం' ప్రాంతంలో ఒక కోపరేటివ్ బ్యాంకు మేనేజరున్ని పిస్తోలు చూపి భయపెట్టి ఆయన వద్దవున్న 21,000 కాజేశారట మరెంతో ఆగంతకులు. ఆయన వెళుతున్న జీపుకు మరో కారుతో అడ్డు తగిలి, ఆపి, యీ అఘాయిత్యం చేశారట. ప్రతిఘటించబోయేసరికి ఆయనమీద తుపాకి పేల్చారట. కానీ ఆయనకు ప్రాణాపాయమేమీ లేదు.

## తెలియని విలువలు

ఇంగ్లండులో ఒకాయన అయిదు షిల్లింగులు పెట్టి పాతకాగితాలు కొంటే అవి, ప్రపంచ ప్రఖ్యాత రచయిత విలియం వర్డ్స్‌వర్త్ రాసుకున్న పద్యాలట. అవేగాక, 19వ శతాబ్దికిచెందిన ప్రెసిడెంట్ల, ప్రధానుల రత్నప్రతులూ వున్నాయట. కొన్ని లక్షల కిమ్మత్తుచేసే యీ కాగితాలు బ్యాంకు సేఫ్‌లో దాచాడటాయన.



# బాడీ కండిషనింగ్

చల్ల ప్రదేశాలలో వుండేటపుడు శరీరం వేడి బడేలాగ, వేడి ప్రదేశాలలో వుండేటపుడు శరీరం చల్లబడేలాగ వుండేలా చేసే మాత్రలు వాషింగ్టన్‌లో కనిపెడుతున్నారట. ఈ పరిశోధన దాదాపు




ఫలించేస్థితికి వచ్చిందట. కొన్ని కోతులకు యీ మందు యింజక్షనిచ్చి, ఐసు పెట్టెలో కూర్చోబెడితే అవి ఖులాసాగనే వున్నాయని డక్టర్ శ్రీ ఎయిర్స్ అన్నారు. ఇంకా పరిశోధన చివరికి రాలేదన్నారాయన.

# సృష్టి విచిత్రం

జకార్తాలో చట్టరీత్యా, అనుమతి పొందిన వేశ్యలు సుమారు పన్నెండువేలమంది వున్నారట. వ్యభిచారం దేశంలో చాలా ఎక్కువగావున్నదనీ, తద్వారా దేశ ఆరోగ్యసంపద తరుగుతోందనీ, 'ఇది' కొన్ని ప్రాంతాలకే పరిమితం చేయాలనీ, కనుక ప్రజలు (పురుషులు) యీ విషయంలో ప్రభుత్వంతో సహకరించితే దేశం 'ఆరోగ్యకరమైన దేశం' అవుతుందనీ జకార్తా గవర్నరు అలీసదికినే తెలియజేశారు— వున్న అనేక సమస్యలలో యిదొకసమస్య.

రాజమండ్రిలో కొన్ని గంటలలో అమలు జరుగనున్న ఒక స్త్రీ మరణశిక్ష నిలుపుచేయమని రాష్ట్రపతి హైదరాబాద్ హోంశాఖ సహకార్యదర్శికి యిచ్చిన తంతి 17వ తేదీన అర్ధరాత్రి హైదరాబాద్ తంతిశాఖకు చేరింది. ఆండర్సన్ అనే వ్యక్తి ఆ తంతిని తక్షణం సహకార్యదర్శికి అందజేయడానికి వెళితే, ఆయన అంతక్రితమే బదిలీచేయబడ్డారని తెలిసిందట. ఒకనో లిప్త ఆలోచించి, తిన్నగా చీఫ్ సెక్రటరీవద్దకే వెళ్లి ఆ టెలిగ్రాం అందజేసి 'శిక్ష' నిలుపుజేశాడట అతని తెలివినీ, ధైర్యాన్నీ, సమయస్ఫూర్తినీ మెచ్చుకుంటూ చీఫ్ సెక్రటరీ ఆ మేరకు ఒక యోగ్యతాపత్రం యిచ్చారట తంతి తపాలాశాఖ అతనికో యిరవై రూపాయలు పారితోషికమిచ్చింది—ప్రాణదానికదో పారితోషికమా!

—పొలాక్షుడు

# పూలరంగడు

'చిత్రాల్లో ఈ మధ్య సెక్సు విపరీతంగా కనిపిస్తూ వుంది ఇది చలన చిత్ర పరిశ్రమకి ముందు ముందు ఎంత నష్టమో గ్రహించలేకుండా వున్నారు. అలా తీస్తేనే గాని జనం చూడరేమోనని భయం వేస్తోంది' అని ఒక ప్రముఖ నిర్మాత తమ అభిప్రాయాన్ని వెల్లడించారు చాలా వరకు నిజం! అలాంటప్పుడు ఒక చిత్రాన్ని వాస్తవిక రూపంలో దిద్ది తీర్చడం కొంచెం సాహసమే అవుతుంది అయినా, నటీనటుల ఉత్సాహానికి సాయంగా—పకడ్బందీగా వున్న కథ, రంజయిన సంభాషణలు, మధురమైన సంగీతం—ఇవన్నీ సూక్ష్మదృష్టి కల పర్యవేక్షణలో కూర్చినప్పుడు ఆ చిత్రం ప్రజల్ని విశేషంగా ఆకర్షిస్తుందని, తప్పక విజయవంతమవుతుందని అన్నపూర్ణావారి 'పూలరంగడు' చిత్రం నిరూపించింది చిత్ర చిత్రానికీ విచిత్రంగా మారుతున్న తెలుగు చిత్రసీమ వైఖరికి పూలరంగడు ఒక కొత్త మార్గం చూపించాడు!

రంగడు గుర్రబ్బండి తోలుకుంటూ నీతిగా బ్రతికే మనిషి అతని చెల్లెలు పద్మ చెల్లెలు పెళ్ళికాగానే తను వెంకటలక్ష్మిని పెళ్ళి చేసుకుంటానంటాడు పెద్దింటి వాడైన ప్రసాద్ పద్మని కోరి పెళ్ళి చేసుకుంటాడు తర్వాత, రంగడి తండ్రి వీరయ్య ప్రసాద్ తండ్రిని చంపిన హంతకుడని తెలుస్తుంది. తండ్రిని కలుసుకోవడం కోసం నరుసును చితక తన్నుతాడు రంగడు! తండ్రి నిర్దోషిత్వాన్ని బుజువు చేయడానికి ధర్మారావింట్లో చేరాడు. ధర్మారావుకి, చలపతికి మధ్య పచ్చగడ్డి వేసి భగ్గుమనిపిస్తాడు రహస్యాలు బట్టబయలవుతాయి. కోర్టులో ధర్మారావు హంతకుడిగా ఒప్పేసుకుంటాడు పద్మ కాపురం నిలబడుతుంది.

కథ చాల కట్టుదిట్టంగాను కొత్త పోకడలోను నడిచింది. దానికి నిండయిన సంభాషణలు తోడై సన్నివేశాలకి సవురభం తీసుకు వచ్చాయి. ముఖ్యంగా, రంగడు ధర్మారావు ఇంట్లో ప్రవేశించిన దగ్గర నుంచి కథ వేగంగా నడుస్తుంది ఈ వేగం సూక్ష్మమైన లోపాలిని కప్పుతూ లక్ష్యాన్ని నెరవేర్చింది వీరయ్య కథని మరో ప్రదేశంలో చెప్పించి వుంటే బావుండేది తండ్రికొడుకుల కలయిక సహజత్వానికి దూరంగా వున్నా, ఆ కలుసుకునే సన్నివేశం చిత్రీకరణ ప్రేక్షకుల మీద మంచి ప్రభావం చూపిస్తుంది సంభాషణలు చెప్పడంలో అక్కడక్కడ ప్రాంతీయత లోపించినా, నటన కప్పి పుచ్చింది రంగడిని చేరదీసిన పోలీసు పున్నయ్య పాత్ర మరీ చిన్నదిగా వుంది చిత్రీకరణలో ఇంకొంచెం శ్రద్ధ తీసుకుని వుంటే బుర్రకథ మరింత రక్తి కట్టి వుండేది పూలరంగడికి అర్థం చెప్పుకోవడంలో ప్రేక్షకులు కొంచెం తికమక పడతారు! సస్పెన్సుని చివరి వరకు నిలపడంలోను, బుజ్జి పాత్రని దిద్దడంలోను, ముగింపులోను దర్శకుని ప్రతిభ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

పూలరంగడుగా నాగేశ్వరరావు నటన తారాస్థాయినందుకుంది. ఈ మధ్య చిత్రాలన్నింటి కంటె మిన్నగా నటించారు. జమున వెంకటలక్ష్మి పాత్రకి కళాకాంతులు తెచ్చింది బుజ్జి మళ్ళీ మళ్ళీ కనిపిస్తే బావుండును అనిపించేంత మనోహరంగా ఆ పాత్రని పోషించాడు పద్మనాభం శోభన్ బాబు ప్రసాద్ పాత్ర అవధుల మేరకు చక్కగా నటించాడు నిర్మలమైన పద్మ పాత్రలో విజయనిర్మల సరిగ్గా సరిపోయింది. గుమ్మడి ధర్మారావు పాత్రని బాగా పోషించాడు చలం ప్రతిభావంతంగా నటించాడు. బేబీగా సూర్యకాంతం ఘాటుగానే నటించింది తక్కిన ప్రధాన పాత్రల్లో పద్మశ్రీ నాగయ్య, అల్లు రామలింగయ్య, భానుప్రకాశ్, మురళీకృష్ణ, గీతాంజలి, మాలతి, రాధాకుమారి బేబీ వరలక్ష్మి, మాస్టర్ రవికుమార్, పాత్రోచితంగా నటించి చిత్రానికి వన్నె తీసుకు వచ్చారు.



'పూలరంగడు'లో విజయనిర్మల.

కథని ముళ్ళపూడి వెంకటరమణ రాశారు. దుక్కిపాటి మధుసూదనరావు సినిమా అనుకరణ చేశారు మాటలు ముళ్ళపూడి రంగనాయకమ్మ కూర్చారు కొసరాజు, నారాయణరెడ్డి, దాశరథి పాటలు రాశారు పాటల్లో భావ, సంగీత సంపదలు పుష్కలంగా వున్నాయి యస్ రాజేశ్వరరావు సంగీతం సమకూర్చారు. ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వం చిత్రానికి ప్రత్యేకత కూర్చింది.

ఒక మంచి చిత్రాన్ని చూశామన్న తృప్తిని ప్రేక్షకుల్లో కలగజేస్తూ, పూలరంగడు నిరాఘాటంగా నూర్నాళ్ళు వెలుగుతాడు! నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావుని అభినందిస్తున్నాను

—నీకరాజు

CHO-110 Tel (R)

# నిగనిగలాడే, అందమైన జుట్టు

## టాటావారి సువాసన గల కేస్టర్ హేర్ ఆయిల

### జుట్టును, రోజంతా చెదరకుండా వుంచును

దువ్వుకొన్న తమ జుట్టును చెదరకుండా వుంచుకుంటారు
కాబట్టి, వ్యక్తులు అందముగా, ఆకర్షణీయముగా కనబడ
తారు. మీరు కూడా టాటావారి సువాసన గల కేస్టర్ హేర్
ఆయిల్ వాడండి. దీనిలోని విశేష గుణముల వలన మీ
జుట్టు ఆరోగ్యంగా వుండడమే గాక దానికి ప్రత్యేకత గల
అందం వస్తుంది. మరియు రోజంతా నిగనిగలాడుతూ
వుంటుంది.

క్రొత్త, ఆకర్షణీయమైన సీసా 3 సైజులలో లభిస్తోంది



టాటావారి కేస్టర్ హేర్ ఆయిల్...
నిగనిగలాడే, చెదరని, ఆరోగ్యమైన జుట్టు కొరకు

# సినిమా

పీసస్ స్టూడియో 3వ ఫ్లోర్‌లో కౌముది ఫిలింస్ 'విడాకులు' షూటింగులో రాజ్‌బాబు రమాప్రభ పాల్గొన్న సన్నివేశాల్ని దర్శకులు శ్రీ కె. ఎస్. ప్రకాశరావు చిత్రీకరించే సమయంలో నేను వెళ్ళడం, నన్ను చూచి రండి, సార్, అని నిర్మాత శ్రీ ఎం. ఎస్. రెడ్డి ఆహ్వానించి 'సీను' వివరాల్ని చెప్పారు

రాజ్‌బాబు, నాగభూషణం యిరుగు, పొరుగు కాపురస్తులు ప్రతిరోజూ నాగభూషణం తన ధర్మపత్ని కృష్ణకుమారిని చచ్చేట్టు చావబాదడం పక్కింట్లో వుండే వీళ్ళు సహించలేక భార్యభర్తలను కలపడానికి ప్రయత్నించి, వీళ్ళు 'విడాకులు' యిచ్చుకునే స్థితికి రావడమే ఆ రోజు జరిగిన సన్నివేశం.

'కిస్...కిస్...కమ్ ఆన్'

పిల్లిగెడ్డం, ఫ్రెంచి మీసం, నల్లద్దాల కంటిజోడు టైట్ ప్యాంటు పైన 'బ్లూ' కోటు ధరించి రాజ్‌బాబు రమాప్రభను చూచి 'కిస్ కిస్ కమ్ ఆన్'. ఇదేగా ఆఖరు సారి 'హ్యాపీగా డిన్నర్ చేసుకుందాం కమ్ ఆన్' అని అంటాడు 'నో నో' అని రమాప్రభ ముఖం చిట్లించుకుంటుంది మొదటి 'టేక్'లోనే ఆర్టిస్టులు 'పర్ఫెక్టు'గా చేయడంతో దర్శకులు ఓ. కే.



'రక్తసిందూరం'లో గీతాంజలి.

చేశారు. ఈ చిత్రంలో కృష్ణకుమారి, వాణిశ్రీ, రమాప్రభ, నాగభూషణం, శోభన్ బాబు, రాజ్‌బాబు ముఖ్య పాత్రల్ని ధరిస్తున్నారు. శ్రీ వేణు సంగీత దర్శకత్వంలో ఆరు పాటలు, 2 పద్యాలు రికార్డు చెయ్యబడ్డాయి. శ్రీ ఘంటసాల, సుశీల, జానకి, పి. బి. శ్రీనివాస్ యీ పాటల్ని పాడారు చిత్రం యొక్క షూటింగు డిసెంబరు ఆఖరుకు అయిపోతుంది అని నిర్మాత వెల్లడించారు.

## ఆజన్మాంతం మరువలేను

'చిన్న చిన్న వేషాల్ని ధరిస్తూ వచ్చిన నాకు శ్రీ భావనారాయణ మొదటిసారిగా 'స్ట్రయిట్ కమెడియన్'గా పరిచయం చేసారు వారిని ఆజన్మాంతం మరువలేను' అని రాజ్‌బాబు చెప్తూవుంటే అతని కళ్ళ నుండి ఆనందబాష్పాలు రాలాయి. 'ఇప్పుడు శ్రీ రెడ్డిగారు 'ఆంథోని' వేషాన్ని నాకు యివ్వడం చాలా అదృష్టం ఈ భూమికను బాగా నిర్వహించానంటే నాకు 'స్టడీమార్కెట్టు' యేర్పడగలదని వూహ

# సినిమా డైరీ

● గౌరి ఆర్టు పిక్చర్స్ నిర్మిస్తున్న "సర్కార్ ఎక్స్‌ప్రెస్" చిత్రంలో శ్రీ గుమ్మడి "ఏజెంటు" గా నటిస్తున్నారు

● ప్రముఖ నటి వహీదా రహ్మాన్ ప్రప్రథమంగా హేమంతకుమార్ నిర్మిస్తున్న హిందీ చిత్రంలో స్వయంగా పాడింది

● ప్రముఖ హాస్య నటుడు శ్రీ నాగేష్‌ని హాస్పిటల్ నుండి "డిశ్చార్జి" చేశారు. ఇటీవల నాగేష్‌కు "కాలు" ఆపరేషన్ జరిగింది.

● డిసెంబరులో ప్రారంభించాల్సిన జగపతివారి "అదృష్టవంతులు" అనివార్య కారణాల వల్ల మార్చి నెలకు వాయిదా వేయబడింది

● పద్మశ్రీ "చింత కాశ్వరం" షూటింగు డిసెంబరు 21 వ తేదీన సారధి స్టూడియోలో ప్రారంభం అవుతుంది ఈ చిత్రానికి దర్శకుడు శ్రీ అచ్చి.

● రిపబ్లిక్ ప్రొడక్షన్స్ "రక్త సింధూరం" డిసెంబరు 7 వ విడుదలయింది

● ఎ. వి. ఎం. కలర్ పిక్చర్ "అవే కళ్ళు" డిసెంబరు 14 తేదిన విడుదలయింది.

● ప్రముఖ సంగీత దర్శకుడు శ్రీ టి. వి. రాజు నెం 9, పోయెస్ రోడ్డులో ఒక పెద్ద యింటిని కొన్నారు

● "వెన్నెల" నాటక పరిషత్ జరిపే ప్రదర్శనలను డిసెంబరు 31 తేదీన కృష్ణగాన సభలో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ప్రారంభిస్తారు

● ప్రముఖ దర్శక, నిర్మాత శ్రీ వి. శాంతారాం కుమార్తె రాజశ్రీకి (ప్రఖ్యాత హిందీ నటి), అమెరికా యువకుడు, శ్రీ గ్రెగరీ చాప్‌మెన్‌కు నవంబరు 29 తేదీన బొంబాయిలో వైభవంగా హైందవ సంప్రదాయానుసారంగా వివాహం జరిగింది

● ప్రముఖ దర్శకుడు శ్రీ కె. పి. ఆత్మాను టి. కె. ఫిలింస్ తమ "ఉమీద్ పే దునియా జీతీ హై" చిత్రానికి దర్శకులుగా నియమించారు. ఈ చిత్రానికి శ్రీ మదన్‌మోహన్ సంగీత దర్శకుడు

● శ్రీ ఎల్. వి. ప్రసాద్ ఆధ్వర్యాన "ఆర్టిస్టు అండ్ టెక్నీషియన్స్ కో-ఆపరేటివ్ సొసైటీ" ఒక హిందీ చిత్రాన్ని నిర్మిస్తున్నారు

● చక్రవర్తి సంస్థ నిర్మించే "నడిగుండాలు" చిత్రంలో శ్రీ కాంతారావు పెద్దకుమారుడు నటిస్తున్నారు

● శ్రీ అమర్తి సుబ్బారావు "అగ్నిపుత్రి" చిత్రాన్ని హిందీ, తెలుగు భాషల్లో నిర్మిస్తారు

● ఇటీవల హైదరాబాదులోని రవీంద్ర భారతిలో ఆంధ్రప్రదేశ్ ఫిలిం జర్నలిస్టు అసోసియేషన్‌వారు ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకర్ శ్రీ బి. వి. సుబ్బారెడ్డి అధ్యక్షతన ఉత్తమ నటీనటులకు, సాంకేతిక నిపుణులకు బహుమతులు పంపిపెట్టారు

# యౌవన చర్మానికి ప్రియమైనది పియర్స్...








## మార్దవమగు, శుద్ధమైన గ్లిసరీన్ సబ్బు

పియర్స్ అత్యంత సున్నితమైన యౌవన చర్మానికి
తగినంత కోమలమైనది. పియర్స్ సబ్బులో గల
గ్లిసరీన్ చర్మాన్ని పొడి ఆరనీయదు...
చర్మాన్ని మఖమల్ వంటి మృదువుగా వుంచుతుంది.
ఎంతో శుద్ధమైనది ఎంత శుద్ధమో కళ్లారా చూడగలిగిస్తుంది.
మీ చర్మాన్ని యౌవనవంతంగా వుంచుకోగలిగించేది
పియర్స్ శుద్ధమైన గ్లిసరీన్ సబ్బు




ఇప్పుడు మీకు అందమైన కొత్త చక్కని
కాగితపు పై మూతలో వున్నది

**పియర్స్ అది ఎంత శుద్ధమైనదో కళ్లారా చూడగలిగిస్తుంది!**

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి శ్రేష్ఠమైన ఉత్పత్తి



శ్రీ పూర్ణా పిక్చర్సు (మద్రాసు) అధినేత శ్రీ జి. కామరాజుగారి జ్యేష్ఠపుత్రుడు చి. ఎం. గిరిబాబు, మైసూరు ఫర్టిలైజర్సు అధినేత శ్రీ వి. వేణుగోపాల్ గారి (మద్రాస్) ద్వితీయకుమార్తె చి. సౌ. పత్రికి ది 27—11—67న జరిగిన వివాహ సందర్భమున తీయబడిన చిత్రం.

స్తున్నా'నన్నాడు. ప్రస్తుతం రాజ్‌బాబు పది చిత్రాల్లో ముఖ్యపాత్రల్ని ధరిస్తున్నాడు. కౌముది ఫిలింస్‌లోనూ, 'సర్కార్ ఎక్స్‌ప్రెస్'లోనూ ప్రేక్షకులు రాజ్‌బాబును మరువలేని పాత్రలు

## 'కొత్త చిత్రాలను అంగీకరించదల్చుకోలేదు'

వీనస్‌నుండి శారదా స్టుడియోలోకి వెళ్లాను. నాకు ప్రముఖ నటి కె. ఆర్. విజయ ఎదురైంది. 'ఏమమ్మా, సౌఖ్యమా' అని అడిగాను. 'ఆండవన్ అరుళ్‌లాల్ సౌఖ్యమా యిరుక్కేనంగో' అన్నది విజయ. 'మీరేమో విదేశాలకు పోబోతున్నట్లు విన్నాను, నిజమేనా' అని ప్రశ్నించాను. దానికామె నవ్వి 'నామీద అభిమానం కొద్దీ' అలా ప్రచారం చేస్తున్నారు నేను కొత్త చిత్రాలను అంగీకరించదల్చుకోలేదు' అని చెప్తూవుండేలోపు 'అమ్మా, సెట్ రెడీ, వారుంగల్' అని 'పాల్మనమ్' సహాయ

# సినిమా

దర్శకుడు పిలవడంతో సెట్సులోకి వెళ్లిపోయింది.

కె. ఆర్. విజయ ఈ పరిశ్రమకు వచ్చి సరిగ్గా నాల్గు సంవత్సరాలే అయినా, అందరికీ అభిమాన పాత్రురాలయింది. ఆమె మనస్సు వెన్నలాంటిది. నిర్మాతలు బాధ పడుతూవుంటే తన సహకారాన్నిచ్చి డబ్బును గూర్చి ఆలోచించకుండా చిత్రాల్ని పూర్తి చేసి యిచ్చిన వెన్నో వున్నాయి. ఇంత త్వరగా ఆమె పరిశ్రమకు దూరం కావడం కష్టం అనిపించినా, ఆమె సాంసారిక జీవితాన్ని గడిపేందుకు నిర్ణయించినందుకు సంతోషించాల్సిందే.

* • *

అదే స్టుడియోలో అజాం ఆర్టుపిక్చర్స్ 'తల్లిప్రేమ' షూటింగులో ఎన్. టి. ఆర్, సావిత్రి, రాంమోహన్ వున్నారని తెలిసి లోపలికి వెళ్లబోయాను. కానీ 'లంచ్‌బ్రేక్' చేసినందువల్ల ఆర్టిస్టులు బయటకు వచ్చేవారు. రామారావు యిందులో యింటి పెద్దగా (సావిత్రి భర్తగా) నటిస్తున్నారు. 'సైకిలు కట్టుపంచె, పైన బనియను, ఒక చిన్న తువాలు' ధరించి రామారావు నడుస్తూవుంటే నేను నమస్కారం సార్, అన్నా. వారు ప్రతి నమస్కారం చేస్తూ, 'ఏమిటీ సంగతి' అని అడిగారు 'ఆడపడుచులో మీ నటన అద్భుతంగా వుందండీ' అన్నాను. దానికి వారు చిరు మందహాసం చేస్తూ 'థాంక్యూ వెరీమచ్' అన్నారు 'తల్లిప్రేమ'లో శ్రీ రామారావు, సావిత్రి ఒక జంటగానూ, రాంమోహన్, కాంచన మరి



'పెద్దక్కయ్య'లో కొత్తనటి సలీమా

యొక జంటగానూ, పద్మనాభం, గీతాంజలి ప్రేమికులుగానూ నటిస్తున్నారు. శ్రీ శ్రీకాంత్ యీ చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు ఈ చిత్రం మళయాళ భాషలో 'కుటుంబం' పేరుతో విడుదలై విజయవంతంగా ప్రదర్శింపబడింది. ఇటీవలనే పి. బి. శ్రీనివాస్, సుశీల పాడిన యుగళగీతం రాంమోహన్, కాంచనలపై చిత్రీకరించినట్లు దర్శకులు చెప్పారు.

* * *

శారదానుండి వాహినికి వెళ్లాను రికార్డింగ్ థియేటరుముందు తమ్మారెడ్డి కృష్ణ

## సి ని షా

మూర్తి, నన్ను చూచి లోపలికి రమ్మన్నారు. లోపలం చలపతిరావు 'ఆర్కెస్ట్రా'కు 'ఫైనల్ నోట్స్' యిస్తూ 'ఓకే రెడీ' అన్నారు. అనడమే తరువాయి 'ఆర్కెస్ట్రా' ఒక్క పారిగా తన ప్రతాపాన్ని చూపించింది.

'అ అ ఆ లు వస్తే కానీ,
బడుబళ్లు రావండీ ..
అత్రంగా పైపైకొస్తే,
అట్టే మంచిది గాదండీ ..'

అని మాధవపెద్ది ఆలాపించారు. వెంటనే వసంత యిలా అందుకుంది.

'సరిగమలో సరసం గలిపి,
పొగిద్దాం మన సంగీతం...'



'ముద్దుపాప'లో పద్మిని.

ఈ పాటను శ్రీ కొసరాజు వ్రాసారు. పద్మనాభం, గీతాంజలిపై చిత్రీకరిస్తారు. ఈ చిత్రానికి శ్రీ సి. ఎస్. రావు దర్శకులు.

*   *   *

రవీంద్రా ఆర్టుపిక్చర్స్ డిసెంబరు 21 తేదీన సారథీ స్టుడియోలో షూటింగును ప్రారంభిస్తారు. మొదటి షెడ్యూలులో 10 సీన్లు, ఒకపాట అయిపోవాలి అని తమ్మారెడ్డి చెప్పారు. ముఖ్య పాత్రను శ్రీ నాగేశ్వరరావు నటిస్తున్నట్లు, అన్ని రసాలకు యీ పాత్రలో ప్రాముఖ్యత వున్నట్లు తన చిత్రానికి 'పూలమనసులు' లేక 'రక్తపాశం' అని పేరు పెట్టదల్చుకున్నట్లు వ్యక్తపర్చారు. శ్రీ కాంతారావు, వాగభూషణం, పద్మనాభం, రేలంగి, ప్రభాకర రెడ్డి, రాజ్‌బాబు, రాజశ్రీ, విజయనిర్మల, గీతాంజలి, సూర్యకాంతం, రమాప్రభ గాక గుమ్మడి 'గెస్టు' గా నటించే యీ చిత్రానికి దర్శకులు శ్రీ సి. ఎస్. రావు.

మూడేళ్లపాప దండేలూ బస్కీలూ

విజయ స్టుడియోలోని 7వ ఫ్లోర్‌లో విజయ - సురేష్ కంబైన్స్ నిర్మిస్తున్న 'పాపకోసం'షూటింగులో శ్రీ సత్యనారాయణ,



# అందరు స్త్రీలకి తెలుసు...కొన్ని సమయాల్లో కేవలం నివారణ మాత్రమే సరిపోదు...

ఒక్కొక్కప్పుడు సారిడన్‌తో సేదదేర్చుకొనే ఆవశ్యకత స్త్రీలకు వుంటుంది. మీకు ఎక్కువ మాంద్యము, నిరుత్సాహము లేక బాధ వున్న యెడల ఒకే ఒక సారిడన్ భారాన్ని తగ్గించి, ఉత్సాహాన్నిస్తుంది. సారిడన్ నొప్పిని, దానివలన కలిగే శ్రమను పోగొట్టును. దానిని వేసుకోగానే మీలో ఎంత మార్పు వస్తుంది! మీరు శక్తితో ఉత్సాహపూరితులై వుంటారు...సరిగ్గా ఆలోచించ కలుగుతారు... స్నేహితులతో సరదాగా వుండగలుగుతారు!

ఒకే ఒక సారిడన్ నొప్పిని పోగొట్టును, సేద దేర్చును, నవోత్సాహమును కలిగించును. అందరు స్త్రీలు నిశ్చయమైన నివారణకు సారిడన్ మీద ఆధారపడవచ్చు. తెలివిగా తలనొప్పి, పంటినొప్పి మరియు ఒంటినొప్పికి కూడ ఎల్లప్పుడూ సారిడన్‌ను మీ దగ్గర వుంచుకోండి.

'రోష్' తయారు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

VT, 5530 (3)

# సినిమా

రావుదాసు బస్కీలు, దండేలు తీస్తూ వుంటే, అదే మాదిరిగా మూడేండ్లు నిండని 'పాప' వాళ్లు చేసిన దాన్ని అలాగే చేసి చూపించింది వాళ్లను చూచి త్యాగరాజా వికటాట్టహాసం చేస్తాడు ఈ సన్నివేశాన్ని దర్శకులు శ్రీ శేషగిరిరావు చక్కగా చిత్రించారు.

*　*　*

'పాపకోసం'లో పాపగా నటించే బేబిరాణి దైవాంశ సంభూతురాలా ' అనిపిస్తుంది. ఎందుకంటే యీ పాపకు సరిగ్గా మూడేండ్లు నిండివుండదు. కానీ, యీ చిరంజీవి 'నటన' చూస్తుంటే ఎంత ముద్దేస్తుంది తెలుసా! డైరెక్టరు చెప్పడమే ఆలస్యం- వెంటనే యీ పాప డైలాగు అయినాసరే ఎక్స్‌ప్రెషన్ అయినాసరే 'రియాక్షన్' బ్రహ్మాండంగా యిచ్చేస్తుంది ఈపాపకు ఉజ్జ్వలభవిష్యత్తు వున్నదనడంలో సందేహమే లేదు 'పాపకోసం' చిత్రంలో బేబిరాణిచుట్టూ కథ నడుస్తుందని నిర్మాత శ్రీ రామానాయుడు చెప్పారు

*　*　*

శ్రీ త్యాగరాజాకు యీ చిత్రంలో యివ్వబడిన పాత్ర చాలముఖ్యమైనది దీన్ని సరిగ్గా చేస్తే తప్పకుండా పరిశ్రమలో నిలబడగలడు ఇంతవరకు నటించిన సన్నివేశాల 'రషెస్' చూస్తే తప్పకుండా యితడు యీ పాత్రకు పరిపూర్ణ న్యాయం చెయ్యగలడనిపిస్తుంది శ్రీ త్యాగరాజా యిప్పుడు డజనుచిత్రాల్లో నటిస్తున్నాడు శ్రీ ప్రసాద్ నిర్మించే హిందీ చిత్రంలో ఒక ముఖ్యమయిన భూమికను నిర్వహించడానికి శ్రీ ప్రత్యగాత్మ బుక్ చేసారని, తాను శ్రీ బి ఎన్ రెడ్డికి, శ్రీ ప్రత్యగాత్మకు సర్వదా ఋణపడివుంటానని వ్యక్తపరిచారు

*　*　*

అక్కడినుండి వాహినికేసి వచ్చాను శ్రీ డి వి ఎస్ రాజు కన్పడ్డారు ఇదే ఆఖరు సెట్టు దీంతో పిక్చర్ పూర్తయినట్లే, అన్నారు. మరి మీ ఆరోగ్యం ఎలావుంది? అని ప్రశ్నించాను 'ఇప్పుడు పర్వాలేదండి' అన్నారు ఈమధ్య రాజుగార్కి కొద్దిగా నస్ట్రీ చేసింది రెండుమూడు పాలు విశ్రాంతి తీసుకున్నారు సెట్టులోపల కృష్ణకుమారి మోసపాడిన పాటకు రియాక్షన్ యిస్తూ వుంటే దర్శకులు యోగానంద్ 'బ్రేక్' అన్నారు.



'ఎరౌండ్ ది వరల్డ్'లో పాశ్చాత్యతారలతో రాజ్‌కపూర్.

కృష్ణకుమారి బయటికి వచ్చింది ఆమె చాల నీరసంగా కన్పడింది ఏమిటండీ, అదోలావున్నారు— అని అడిగాను. 'నాకు యీ మధ్య జ్వరంవచ్చి, ఒకవారం పడక దిగలేదండీ. ఇప్పుడే కాస్త నయంగా వుంది' అన్నది

*　*　*

కృష్ణ కుమారికి 'గుడ్‌బై' కొట్టి ఎ పి రూముకి వెళ్లాను అప్పుడే భోజనానికి సిద్ధమయిన కృష్ణ, రమాప్రభ, కెమరామెన్ స్వామి, దర్శకులు రామచంద్రరావు రండిసార్ భోంచేస్తాం అనిపిలిచారు, చదివింది ఒకటో తరగతే!

రమాప్రభ సరదాగా ఉంటుంది ఎప్పుడూ తమాషాగా జోక్స్ విసురుతూ అందర్నీ నవ్విస్తూ వుంటుంది ఈమెకు చిన్నపాపల్లాగా సర్వదా తగువులాడడం, రాజీపడడం, పుస్తకాలను చదవడం అంటే చాలా యిష్టం ఈమె చదివింది ఒకటవ తరగతి మాత్రమే! కానీ, స్వయం శక్తితో తెలుగు, తమిళభాషలను చదవడానికి, వ్రాయడానికి నేర్చుకుంది 'ఏమండీ, అవకాయ తెచ్చిపెడ్తారా?' అని కృష్ణను అడిగింది 'అంటే మీరు అవకాయ ఫ్యానా' అని అడిగాను 'అవునండీ, నాకు ఊరగాయ అంటే చాలా యిష్టం' అన్నది ప్రస్తుతం రమాప్రభ విశ్వశాంతి, టైగర్, కౌముది, శ్రీ కాంత్, పి. ఎ. పి. నవజ్యోతి, రవీంద్రా ఆర్ట్స్, గౌరి, కల్పనా, శ్రీ ఛాయా శ్రీ మాతా నిర్మించే చిత్రాల్లో నటిస్తున్నట్లు చెప్పింది 'నాకు శోభన్ బాబు అడాప్టెడ్ బ్రదర్' అన్నది నవ్వుతూ.

*　*　*

సీతారామా ప్రొడక్షన్స్ థామస్ స్టుడియోలో 'పొన్నుమాన్‌రాజు' చిత్రాన్ని డబ్ చేసారు 'గౌరికళ్యాణం' అనే తమిళ చిత్రాన్ని శ్రీ వి ఎస్ బోసు 20 రోజుల్లో తెనుగు చేసారు ఇందులో రవిచంద్రన్, జయలలిత. జయశంకర్ ముఖ్య భూమికల్ని పోషించారు.

శ్రీ బోసు యింతకు పూర్వం ఇందిరా రమణాలోనూ, గౌతమిలోనూ సహాయ దర్శకుడిగా పనిచేసారు వయస్సు చిన్నదయినా అనుభవం చాలా వుండడం వల్ల కొందరి సలహా ననుసరించి నిర్మాతగా మారాడు.

*　*　*

విజయభట్ మూవీస్ 'సుఖదుఃఖాలు' యొక్క రీ—రికార్డింగ్ శారదాస్టుడియోలో మొన్నటితో ముగిసింది శ్రీ భట్, వేంకటేశ్వరరావు నిర్మించిన యీ చిత్రం జనవరి మొదటి వారంలో విడుదలవుతుంది శ్రీ రంగారావు, జయలలిత, వాణిశ్రీ, హరనాథ్, చంద్రమోహన్, రామకృష్ణ ముఖ్య భూమికల్ని ధరించారు శ్రీ ఐ ఎన్ మూర్తి దర్శకత్వాం వహించారు. సంగీతాన్ని శ్రీ కోదండపాణి



'ప్రతీకారం'లో సంధ్యారాణి.

# సినిమా

సమర్పించారు. సహనిర్మాత. హెచ్. పి. సుందర్.

## పాటకి 60 పైగా వాయిద్యాలు

పి. ఎ. పి. 'బ్రహ్మచారి' షూటింగు అయిపోయింది. రీ—రికార్డింగ్ జనవరిలో ప్రారంభం కాగలదు. ఈ చిత్రంలో 'డ్రీమ్‌సాంగ్' బ్రహ్మాండంగా వచ్చింది. ఈ పాటకు 60 కి పైగా వాయిద్యాలను మూడు ట్యూన్సులో శ్రీ చలపతిరావు వాడారు. ఈ చిత్రంలో నాగేశ్వరరావు, జయలలిత, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, చలం, రాజ్‌బాబు, సూర్యకాంతం, రమాప్రభ ముఖ్య పాత్రల్ని పోషించారు. శ్రీ తాతినేని రామారావు డైరెక్టు చేసారు. ఇటీవలనే 'సెతనూర్ డామ్'లో శ్రీ నాగేశ్వరరావు, జయలలితలు నటించిన ప్రేమగీతం చిత్రీకరింపబడింది ఈ చిత్రం 'ఎంగ్ళ్ నివాళ్ గ!' తమిళచిత్రం ఆధారంగా నిర్మింపబడింది. చక్కటి చిత్రాలను నిర్మించే శ్రీ ఎ. వి. సుబ్బారావు ఈ చిత్రాన్ని కూడా ప్రేక్షక జనరంజకంగా నిర్మించారు.

## పెద్ద మార్పు

మధు పిక్చర్స్ చిత్రానికి 'మంచి కుటుంబం' అని పేరు పెట్టినట్లు శ్రీ మల్లికార్జునరావు వెల్లడించారు శ్రీ నాగేశ్వరరావు 'గెటప్ లోనే కాదు—వేష, భాషల్లో కూడా పెద్దమార్పు కనపడుతుంది ఈ చిత్రంలో,' అన్నారు నిర్మాత తమిళంలో శివాజీగణేశన్ వేసిన వేషాన్ని శ్రీ అక్కినేని తన స్వంత శక్తితో బ్రహ్మాండంగా నటించినట్లు నిర్మాత వ్యక్తపర్చారు ఇది వినూత్నమైన చక్కటి కుటుంబ చిత్రం. శ్రీ నాగేశ్వరరావుకు 'షావుకారు' జానకి. కాంచనలు భార్యలుగా నటించారు శ్రీ వి. మధుసూదనరావు డైరెక్టు చేసారు. కోదండపాణి సంగీతాన్ని సమర్పించారు.

*   *   *

విశ్వశాంతివారు నిర్మిస్తున్న 'నిలువు దోపిడీ' షూటింగు డిసెంబరు 1 తేదీన అయిపోయింది. శ్రీ సి. ఎస్. రావ్ దర్శకత్వంలో శ్రీ రామారావు విభిన్నపాత్రలను నటించారు. ముఖ్యంగా వసాదుగా, కోయదొరగా శ్రీ ఎన్. టి. ఆర్. నటన చాలా బాగావచ్చిందని నిర్మాత శ్రీ విశ్వేశ్వరరావు వ్యక్తపర్చారు. ఇందులో దేవిక నాయిక. శ్రీ మహదేవన్ సంగీత సారథి శ్రీ మహారథి కథకుడు. శ్రీ పద్మనాభం హాస్యం కొత్త పంథాలో నడిచిందట.

*   *   *

గౌరి ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'పాలమనసులు' షూటింగు పూర్తయినట్లే. ఇందులో శ్రీమతి జమున, గుమ్మడి, హరనాథ్, చలం, రావికొండలరావు, పండరీబాయి నటించారు. శ్రీ సత్యం సంగీతాన్ని అందించారు. శ్రీ భావనారాయణ నిర్మిస్తున్న యీ చిత్రం కూడా జనవరికి విడుదల కాగలదు.

—శ్రీనివాస్

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

వెండితెరపై చూడని సరికొత్త కథ!
ప్రముఖ తారలంతా నటించిన చిత్రం!

**తప్పక చూడండి!**

ఝమా... ఝమ్!



లలితాశివజ్యోతి

# రహస్యం

నిర్మాత
ఎ.శంకరరెడ్డి M.A.BL., * దర్శకుడు వేదాంతం రాఘవయ్య

వాణీ రిలీజ్

మనోహరమైన
ఈస్ట్‌మన్ కలర్
చిత్రం!